# స్వరాజ్యసోపాన గ్రంథమండలి

## —: విజ్ఞాపన :—

ఈ గ్రంథ మండలిలో మాప్రణాలిక ననుసరించి నెలకొక నూతన కాలానుగుణ్యమగు గ్రంథమును 2 నెలలకొక మా పూర్వ గ్రంథమును వెలువడును. ఆ ప్రకారము మా ప్రచురణ లన్నింటి మేలిప్రతులు మా పోషక వర్గమునకు చందాదారులకు సక్రమముగ అందించబడును.

పూర్వమువలెనే మా పాఠక మహాశయులు సారస్వతికవిద్యా మానులు, రాజకీయ సాంఘిక ప్రముఖులు, దాతలు మా యీ సత్ప్రయత్నమునకు తోడ్పడి మా పోషక వర్గమున చేరి మమ్ము ప్రోత్సహించ ప్రార్థితులు.

విరాళములు :-

| | | | |
|---|---|---|---|
| మహారాజ పోషకులు | — | శాశ్వతి చందా | 1116-0-0 |
| రాజపోషకులు | — | డిటో | 116-0-0 (అంతకుపైన |
| పోషకులు | — | సం॥ చందా | 25-0-0 |
| చందా దారులు | — | డిటో | 12-0-0 |

పరా :- మా పోషకవర్గమువారి జీవిత చరిత్ర చిత్రపటములతో ప్రచురించబడును.

... సిద్ధముగ నున్న గ్రంథములు ...

విజయభారతం — 0-6-0 గాంధీ విజయం (స్టేజినాటకము — 2-0-0. స్వరాజ్యసౌధము (క్విట్ ఇండియా) — 1-0-0 "ఇదా స్వరాజ్యము" (ఖండకావ్యము) — 0-4-0 "రష్యా రాజ్యాం - జర్మనీ యుద్ధం — 0-4-0 నిలువీత (డిటో) — 0-4-0.

— ప్రచురణ కానున్నవి —

1. గాంధీమహోదయము 2. [illegible] (గాంధీ హరికథ) 3. పాంచాల పరాభవము (పంజాబుహాస్య నాటకము) సంస్కారిణి (సాంఘిక నాటకము - పోతన [illegible] భక్తమీరాబాయి. భగవాన్ నారద - విశం

—: రాజధానీ అడ్రసు :— [illegible]
హిమయత్ నగర్-హైదరాబాదు.

ఇట్లు [illegible] గ్రంథకర్త
స్వరాజ్యసోపాన నిలయం
గుంటూరు-2.

పరా :- [illegible]

శ్రీ

# గాంధీ విజయము

అను

# స్వరాజ్య సోపానం

గాంధీ "పవిత్ర విజయాలు"

— అని చెప్పబడే - స్టేజీ రాణీ —

ఈ నాటకము తెలుగున 1920 సం॥ లో రచింపబడి విరివిగా ఆంధ్రదేశమంతటా ప్రదర్శింపబడి, 1935 సం॥ వరకు అసహాయోద్యమ ఘట్టములు అప్పటికప్పుడే రచించిచేర్చబడి బ్రిటిష ప్రభుత్వము వారిచే నిషేధించ బడి నాటక గ్రంథములు వేసకువెలుతగుల పెట్టించ బడిన .. తొలి జాతీయ నాటక రాజము ..

ద్వితీయ ముద్రణము
1961 కార్తీకమాసం




గ్రంథకర్త :
"జాతీయ నాటక పితామహ, సహజకవి, జాతీయ కవిచక్రవర్తి"
శ్రీ దామరాజు పుండరీకాక్షుడు

స్వరాజ్యసోపాన నిలయము, గుంటూరు-2.

 మూల్యము : 2-00

# ఇందలి పాత్రలు

పురుషులు :—

1. గాంధి-(తలగుడ్డగాంధీ-గాంధీ టోపీగాంధి-కొల్లాయిగాంధీ)
2. మోతీలాల్ నెహ్రూ
3. మదన్ మోహన్ మాలవ్యా
4. లాలాలజపతిరాయ్
5. బిపిన్ చంద్రపాల్
6. చిత్తరంజనదాస్
7. షౌకతాలీ
8. మహమ్మదాలీ
9. జవహర్ లాల్
10. వల్లభాయ్ పటేల్
11. దేశ సేవకులు—శాంతా రాం, హీరలాల్, ధీరసింగ్, శాంతా రావ్ మొ॥వారు.
12. పల్లెకారులు
13. పోలీసు ఆఫీసరు
14. అబ్దుల్ ఖాదర్—పోలీస్ సార్జంటు
15. భేషజం-పోలీస్ చేలా
16. రావుసాహెబ్
17. అధికారి ..
18. హరిజన్
19. ఆవేశుడు
20. ఆహ్వాన సంఘాధ్యక్షుడు

—: స్త్రీలు :—

1. (శ్రీ) భరతమాత
2. (శ్రీ) సరళాదేవి—చౌదరాణి
3. (శ్రీ) సరోజినీదేవి
4. (శ్రీ) అనిబిసెంటు

## —: కృతజ్ఞత :—

వాస్తవికముగ ఈనాటికి "అభినవకృష్ణరాయ" లే అయినను ఆవిధముగ సంబోధించబడుటకుగూడ ఇష్టపడని నిరాడంబరమహావ్యక్తి,

—: శ్రీ ఏ హా ఆంజనేయు :—

సకల బుధజన సన్మానితులగు

ఈ నాటకమును నేను 1920 సం॥లో రచించిన వెంటనే తాను చేపట్టి శ్రీ సంఘసేవ నాట్యమండలి నేర్పరచి ఇటు బళ్లారి మొదలు అటు విశాఖపట్టణము వరకు విజయవంతముగ నాటక ప్రదర్శనములు సాగించి తాను స్వయముగ హాస్యనట పాత్రలధరించి నాటక ప్రదర్శనముల ను ప్రోత్సాహమునొసగించి ఆర్జితద్రవ్యమును కాంగ్రెస్ సంస్థకే సమర్పించుచూ, నాటి బ్రిటిష్ ప్రభుత్వమువారు విధించిన నిషేధములు నిర్బంధములు లాఠీ దెబ్బలుగ సహించుటకు జైలునలంకరించి మా నాటకమున కానాడు అఖండ ప్రచారముగూర్చినందుకు—

ఈ నాటక ప్రతుల నన్నింటిని లైబ్రరీలలోను పఠనాలయము లలోను పాఠకుల ఇండ్లలోను గాలించి గాలించి తగుల పెట్టించుటచే ఈ 30 సం॥ల నుంచి నశించిపోయిన ట్లేయున్న ఈ నాటకమును తిరిగి నా జీవితములో ముద్రింప జాలనేమోయని దిగులుపడి దిగజారిన నా మనస్సునకు మరలతగిన ప్రోత్సాహము, సహాయము, సహకారము సంపూర్తిగ నాకు ప్రసాదించి నాచే ఈ గ్రంథమునిట్లు వెలువడజేసి ఈ నాటకరాజమును పునరుజ్జీవ మొనర్చినందుకు,—

మా కృతజ్ఞతా పూర్వక అభివందనాలు

— శుభాశీస్సులు —

వాసురాజు పుండరీకాక్షుడు

గ్రంథకర్త:

## కవి వాక్కులు

అభినవాంధ్ర సాహిత్య మహాప్రబంధ
"శాంతి" వెలయించి సహధర్మ చారిణియగు
ఆదిలక్ష్మి సతీమణి కాత్మశాంతి !
సకల కవి పండితాశీః ప్రశాంత కాంతి !
క్రాంతి ఘటియించినావు సారస్వతమున,-
ఆయురారోగ్యములివె ! శ్రీ ఆంజనేయ!

ఏకా వార్ధిధిసోమున్
రాకాసుధ నిర్మలానురాగ సుధామున్
ప్రకట సుగుణోద్ధామున్
శ్రీకరుడగు ఆంజనేయు శ్రీధరుడోమున్

— ఓం తత్సత్ —

# —: ప్రస్తావన :—

శ్రీ దామరాజు పుండరీకాక్షుడు నా ఆప్తమిత్రుడు. 1920 సం॥లో ఆయన విద్యార్థిగా నుండి గాంధిమహాత్ముని పిలుపువినగానే అసహాయోద్యమములో ప్రవేశించి వెంటనే యీ "స్వారాజ్యసోపాన" నాటకమును రచించెను. అప్పటికే ప్రఖ్యాత నటకర్తలైన శ్రీ పత్రి సీనప్పగారు జగర్లపూడి నరశింహారావుగారు మున్నగు దేశాభిమానులైన నటకులతో మేము సంఘసేవా నాట్యమండలిని సమకూర్చి ఈ నాటకమును ఆంధ్ర దేశమంతటను ప్రదర్శించితిమి ఈ నాటక ప్రదర్శనములు ఆనాటి ప్రేక్షకులలో మిక్కిలి ఉత్సాహము ఉద్రేకము రేకెత్తించుచుండెడిది. తత్ఫలితముగా అప్పటి ప్రభుత్వము వారి నిర్బంధములకును కవిగారు తెరముదాల్చ్చ నుండెను. ఆ వివరములన్నియు శ్రీ కవిగారి తొలిపలుకులలో విపులముగా ఉదహరింపబడినవి.

ప్రదర్శనములు నిషేధింపబడుటతోడనే శ్రీ కవిగారు ఆ నాటకమును వివిధ గ్రంథములుగా ముద్రించి ప్రకటించసాగిరి. కాని ప్రభుత్వమువారు వాటినీ సాగనీయక నిషేధించి తగులబెట్టించిరి. అందువలన ఈ నాటక గ్రంథములు ఈ 30 సం॥ల నుంచి అంతరించుటయే గాక గ్రంథకర్తగారు చాలకష్టములకుగూడ గురియైరి.

సరళతరోత్సాహకముగను దేశభక్తిప్రబోధకముగను ఈ స్వారాజ్యసోపాన నాటకములు ఇప్పటికిని ఎప్పటికినీ అమూల్యములే. ఆ గ్రంథములన్నింటిని ప్రచురించుట ఏ ఒక్కరికినీ సాధ్యమైనపనిగాదు. మన జాతీయ ప్రభుత్వమువారు ఆపనిని నిర్వహించినచో ఎంతయూ దేశోపకారముగ పరిణమించెడిది.

శ్రీ గ్రంథకర్త ఆ గ్రంథములన్నింటిని మరల ప్రచురించుటకు చాలకృషి చేయుచున్నారు. జాతీయాభిమానులు, కళాపోషకులు దేశభక్తులు దాతలు వారి సత్ప్రయత్నమునకెంతయు తోడ్పడి ఆ మహా గ్రంథములను ఆంధ్రలోకానికి దక్కించెదరుగాక యని ఆశించుచున్నాను.

గుంటూరు

ఇట్లు
ఏక ఆంజనేయులు

# ప్రశంసా పత్రములు

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు (స్పీకరు ఆంధ్ర లెజిస్లేటివ్ అసెంబ్లీ) వారు వ్రాసిన తొలిపీఠిక 1920,—

స్వరాజ్యసాధన కొరకు భరత వర్షము గాంధిమహాత్ముని నాయకత్వము క్రింద దృఢప్రయత్నము గావించుచున్న ఈ సమయమున దేశభక్తులగు శ్రీ దామరాజు పుండరీకాక్షుడు ఆంధ్రమున 'స్వరాజ్యసోపాన' 'గాంధీమహోదయము' అను నాటకములు రచించి నూతనోద్యమరహస్యములను దేశములో వెదజల్లుటచాల కాలానుగుణ్యముగను దేశమున కెంతయు లాభకరముగ నున్నదని వేరుగ చెప్ప నక్కరలేదు. ఇంతవరకు ఆంధ్రదేశములో రాజకీయ నాటకములు లేనేలేవు చారిత్రాత్మక నవలలు నాటకములు ఉన్నను అవి ప్రస్తుత స్థితిగతులకు పనికివచ్చునవికావు...... ఇట్టి నాటకములు వ్రాయుటకు తగిన పాండిత్యము ఉత్సాహము దేశభక్తి గల నాటక కర్త నేడు బయలుదేరి ముందు రాబోవు వారికి మార్గదర్శకుడైనాడు ఈ నాటకము మిక్కిలి హృదయాకర్షకరముగను రసవంతముగను ఆదర్శములను చక్కగా పోషించునదిగనున్నది. ......ఇది వ్రాసిన గ్రంథకర్త ధన్యుడు.

విజయవాడ
1920

ఇట్లు, బుధజనవిధేయుడు
అయ్యదేవర కాళేశ్వరరావు

---

*(తిరిగి 7-7-1958 న వారు ఆంధ్ర అసెంబ్లీ స్పీకరుగా నున్నప్పుడు ఈ నాటకములనుగూర్చి శ్రీ శ్రీ రాజేంద్రప్రసాదు గారికి (భారత అధ్యక్షుడు) వ్రాసిన లేఖలో,—)*

'శ్రీ దామరాజు పుండరీకాక్షుడు ఆంధ్రజాతీయకవి. శ్రీ సుబ్రహ్మణ్యభారతి తమిళ జాతీయ కవియై జాతీయాదర్శములను పూర్తిగా తన కవిత్వమున కుప్పించియున్నట్లు శ్రీపుండరీకాక్షుడు సంపూర్ణ జాతీ

యోత్సాహమును నాటకములో నాట్యమాడించెను. ఆయన రచించిన నాటకములన్నియు అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం వారు నిషేధించి తగుల బెట్టించిరి. ఆ నాటకములలో నొకటైన 'గాంధివిజయము' పై ఆంక్షను శ్రీ రాజాజీ మదరాస్ పరిపాలనలో తీసివేయించు భాగ్యము నాకబ్బినది. మిగతా వాటిపై ఆంక్ష 1947 లో శ్రీ ప్రకాశం పంతులు గారి పాలనలో పూర్తిగా తీసివేయబడినది.

వారి నాటకములన్నియు దేశభక్తిను ద్రేకించుటలో అత్యున్నతమైనవి. భారతములో ఇట్టి మహాత్కార్యమింకెవ్వరును చేసి యుండలేదు ఆ నాటకములన్నియు ధనాభావమున ప్రచురింపబడి యుండలేదు గాని ప్రఖ్యాతనటులచే విరివిగా ప్రదర్శించబడినవి. ఆ వారి గ్రంథములన్నింటిని తిరిగి ప్రచురించుటకు శ్రీ ప్రభుత్వమువారును, జాతీయాభిమానులు, కళాపోషకులు, తగిన సహాయముచేయుట ఎంతయో ఆవశ్యకము.

*గా॥ శ్రీ పి. వి. రాజమన్నార్, ప్రధాన న్యాయమూర్తి, మదరాస్*
*హైకోర్టు (ఈ) అఖిలభారత సంగీత నాటక అకాడమీ అధ్యక్షుడు*

'నాకు స్వయముగా వారితో పరిచయము లేనప్పటికి మన భారత స్వాతంత్ర్యపోరాటములో శ్రీ దామరాజు పుండరీకాక్షుడుగారి రచనలు వారి కృషి నే నెరుగుదును. తొలి 1920 సంవత్సరాలలో వారు చాలా నాటకములు రచించిరి. అవి అన్నియు చాల దేశభక్తిపూరితములై యుండెను. వాటిలో ఎన్నటికి మరపురాని పంజాబుదురంతముల వంటి విషయములు (పాంచాలపరాభవము) గూడనున్నవి. వారి నాటకాలలో చాల ప్రఖ్యాతి గాంచినవి 'స్వరాజ్యసోపానం' 'గాంధి విజయం' మొదలగునవి. ప్రజారంజకమైన 'కలియుగ ప్రహ్లాద' అను హరికథ గూడ వారు రచించినదే......దురదృష్టవశాత్తు వారి గ్రంథములన్నియు నాటి బ్రిటీష్ ప్రభుత్వమువారిచే నిషేధించబడి ప్రదర్శనములు నిర్బంధించబడినవి. గ్రంథాలయములలోను పఠనాలయములలోను ఉన్న గ్రంథాలుగూడ గాలించి పట్టుకొనబడినవి. ధనాభావము మున్నగు

అనివార్య కారణములవలన వారింతవరకు వాటిని ముద్రించజాలకున్నారు నిస్సందేహముగా వారి ఉత్తమ రచనలు తిరిగి ప్రచురింపబడవలెను. ఆ గ్రంథములు ఆయాకాలాను సారముగ దేశభక్తి పూరితములేగాక సారస్వతముగ గూడ చాలఉన్నత స్థాయిని విలువగలవై యున్నవి. ......

---

*( శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు గవర్నరు మధ్య ప్రదేశ్ – 10-7-58 )*

'శ్రీ దామరాజు పుండరీకాక్షుడు నాకు చిరకాలపరిచితుడు. రాజకీయ రంగములో నాతో సహచారి అప్తమిత్రుడు అయియున్నా అతను నా కంటె చాల చిన్నవాడు. విద్యార్థిగానే అతను అసహాయోద్యమములో 1920 లో ప్రవేశించాడు. అతను పుట్టుకతోనే సహజకవి. చదువు చాలించి సంపాదించిన విరామము అతని కవితా ప్రభావముతో మేళవించబడి నాటి సాంఘిక రాజకీయ ప్రచారమునకు చాల ఉపకరించినది. శ్రీ దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు చెప్పినట్లు "ఆంధ్రదేశములో జరిగిన రాజకీయ ప్రచారములో సగంవంతు 1920–21 లగాయతు శ్రీ పుండరీకాక్షుడు ప్రచురించిన నాటకములు మున్నగు రచనలవల్లనే జరిగినది"...దురదృష్ట వశాత్తు అతను ప్రచురించిన ప్రతి పుస్తకము ఆనాటి ప్రభుత్వము నిషేధించి తగులబెట్టించినది ఆ విధముగ ఆ గ్రంథములు నశించుట వలన గలిగిన నష్టములు అతనికేగాక భారత జాతికే చాలఘోరనష్టం పరిణమించినవి. అతని వంతు జైలు శిక్షగూడ అనుభవించాడు ఎప్పటికిప్పుడు మొలకలెత్తే అతని కవితా ప్రయోగములు అతని, మరీముఖ్యముగా నాటకములు అమోఘ జాతీయసేవాపేక్షను సూచించును... ...

తగిన ప్రోత్సాహముంటే ఇంకా ఇప్పటికీ జాతీయ సారస్వత మెక్కువగా వెలయించే ఉత్సాహమతనిలో ఉన్నది. అతని అద్భుత

ప్రవీణతకు పూర్వ రచనలకు గాను తగిన పారితోషికమును ముందు ఇంకా చేయుకృషికి తగిన ప్రోత్సాహమును పొందుట కెంతయు అర్హుడు. ప్రభుత్వము వారతనికి తగిన నష్టపరిహారమును పారితోషకమును ప్రసాదించవలెను. [ హైదరాబాద్ 10-7-58 ]

---

*( శ్రీ మాన్. M. అనంతశయనం అయ్యంగార్-స్పీకర్-లోక్‌సభ 20 అక్బర్ రోడ్ న్యూఢిల్లీ - 17-12-1960 )*

గుంటూరు జాతీయకవి శ్రీ దామరాజు పుండరీకాక్షుడు అసహాయోద్యమ సత్యాగ్రహోద్యమములలో చాలా గ్రంధములు రచించారు అవిచాలా దేశభక్తి పూరితములై ఆంధ్ర దేశమున చాలామంది యువకులను గాంధీ యుద్యమములో దుముకునట్లు ఆకర్షించినవి. ... ఆ గ్రంధములన్నియు చక్కని ద్రాక్షపాకములో వ్రాయబడి దేశభక్తి పూరితములై యున్నవి. అవి ఇప్పుడు అచ్చులోలేవు. అవి నశించినచో మన దేశమునకే చాలనష్టము. ఆయన చాల బీదవాడు. వాటిని తిరిగి ప్రచురింపజాలడు. ప్రభుత్వమువారతనికి తప్పక తోడ్పడవలెను.

---

*( ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ-బెజవాడ )*

## జాతీయ కవి సన్మానం

శ్రీ దామరాజు పుండరీకాక్షుడు తమ రచనలద్వారా ఆంధ్ర ప్రజల జాతీయ చైతన్యవ్యాప్తికి జాతీయోద్యమ వికాస విజయాలకు తోడ్పడి చెన్నపురిలో 10 సెప్టెంబరు తేదీన జాతీయ విజ్ఞాన పరిషత్తు యాజమాన్యాన జరిగిన జాతీయ కవుల సన్మాన సభలో పాల్గొన్నందులకెంతయు కృతజ్ఞులము.

చెన్నపురి
10-9-1947

రంగా
అధ్యక్షులు

( మధ్వశ్రీ, మహామహోపాధ్యాయ అవధాన శిరోమణి విద్యావారిధి
శ్రీ శ్రీ కాళీకృష్ణాచార్యా - ఆస్థానకవి-ఆంధ్రప్రదేశ్. )

నేను శ్రీ దామరాజు పుండరీకాక్షుని అతని బాల్యమునుండి యెఱుగుదును. అతను 'పుట్టుకవి', 'సహజకవి'-అతని జీవితమంతా సారస్వత సేవలో నేగడపి స్వతంత్ర పోరాటములో చాలా ప్రచారం జకమైన నాటకములు రచించాడు. వాటినన్నిటిని అప్పటి బ్రిటీష్ ప్రభుత్వం తగులపెట్టించి నిషేధించినది. చరిత్రాత్మకముగను సాంస్కృతికముగను అతని గ్రంథముల పునర్ముద్రణ చాలా అవసరము. ఆయన ధనవంతుడు కాడు ఆ గ్రంథములన్నింటిని తానే తిరిగి ముద్రించజాలడు. విద్వత్కవి సత్కారముగ ఆయనకిప్పుడు కేంద్రప్రభుత్వ సాంస్కృతిక శాఖవారు ఇచ్చే 50 రూ.లు మాసపారితోషికమును కనీసము 100/- రూ॥లకైనా యావజ్జీవముగ పెంచి ఆ గ్రంథముల పునర్ముద్రణకు కొంత మొత్తమును ప్రత్యేకముగ ఇచ్చుట చాలా అవసరము.

( అభిప్రాయములన్నియు ఇంగ్లీషుకు తెలుగు అనువాదములు )

# పునర్దర్శనము

## తొలిపలుకు :-

పాఠకలోకానికి నాటక ప్రేక్షక లోకానికి ఇవేమానమస్సులు. ఈపునర్దర్శనము ముప్పది నిండుసంవత్సరములకు. ఇదియే 1920 సం॥లో మేము ప్రదర్శించి ప్రచురించిన తొలి నాటకము. ఇట్టి నాటక మొకటుండెనని బహుశా యీ తరంవారికి తెలియనే తెలియదేమో. అందుకు కారణం ఆనాటి మా గ్రంథము లన్నింటిని [అనగా స్వారాజ్య సోపానం, గాంధీ మహోదయం, గాంధీ విజయం, కలియుగ ప్రహ్లాద (హరికథ) పాంచాల పరాభవము, సంస్కారిణి, కెమాల్ పాషా (తెలుగు, ఇంగ్లీషు), గుంటూరిగొప్ప (పన్నుల నిరాకరణ), స్వారాజ్య సభ మున్నగునవి.) నాటి ప్రభుత్వంవారు గాలించి గాలించి తగుల

బెట్టించుటయే. వాటిలో 'పాంచాల పరాభవము' (పంజాబుహత్యలు) గూర్చి బ్రిటీష్ పార్లమెంటులో ప్రశ్నపరంపరలు వేయబడినవి. (డయ్యర్ ఓడ్వయర్' అనే పంజాబు మిలటరీ పరిపాలకుల బొమ్మలను స్టేజిపై తగులపెట్టించిన కారణంగా) ఇందలి 'గాంధి మహోదయ' నాటకమును అనేకమంది పలుచోట్ల ప్రదర్శించి జైళ్లకుపోయిరి. అట్టి వారిలో శ్రీ బౌద్ధవాఙ్మయబ్రహ్మ దుగ్గిరాల బలరామకృష్ణయ్యా చౌదరిగారొకరని వారిస్వీయ చరిత్రనుండియే తెలియుచున్నది. ఈ నాటకమునే మన శ్రీ రైతురంగాజీ లండనులో ప్రదర్శించిరని విన్నాను. ఈ నాటకమును కాకినాడలో ప్రదర్శించునాడే హాలుకు పోలీసువారు తాళములువేసి నటకులమైన మా అందరిని జైలులో పెట్టగా శ్రీ బులుసు సాంబమూర్తిగారు ఆరోజు కోర్టుకు హాజరయి సరాసరి ఆ సాయంకాలము జరిగిన మహాసభకు హాజరై తమ నల్ల కోటు తలగుడ్డ అగ్ని కాహుతిజేసి అమాంతము ఆజన్మాంతముగ అస హాయోద్యమములోదూకిరి. అదే సమయమున విశాఖపట్టణవిద్యార్థులు 25 మంది యీ నాటకమును ప్రదర్శించి అరెస్టుచేయబడి జైలుకు వచ్చిరి. జైలులో విడికొట్లుఖాళీలేనందున అందరిని ఒక ఖాళీహాలులో నుంచగా వారందరు ఆ రాత్రియే ఆ హాలులోనే యీ నాటకమును మరల ప్రదర్శించగా జైలంతయు 'మహాత్మాగాంధీకిజై' అను నినాదాలతోనిండిపోయినది. ఆ సమయమున శ్రీ ఏకా ఆంజనేయులుగారు గూడ ఆ జైలులోనే ఉండిరి. ఆరోజులలో ఇంకనూ ఎందరో అజ్ఞాత వ్యక్తులు నాటక సమాజికులు ఈ నాటకములను ప్రదర్శించి లాఠీచార్జిలకు జైలు శిక్షలకు పాత్రులైరి. శ్రీ కీ. శే. దేశభక్త కొండవెంకటప్పయ్యా పంతులుగారు. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్యాగారు ఈ నాటకములో అప్పుడప్పుడు కల కత్తా స్పెషల్ కాంగ్రెస్ అధ్యక్షులుగా పాత్రధరించేవారు. ఈనాటక ప్రదర్శనముల నరికట్టుటకు నాటి బ్రిటీష్ ప్రభుత్వమువారు ప్రత్యేకముగ Dramatic Performances Act (Sec. 3A ) అను స్పెషల్

సృష్టించు అప్పటినుంచి ప్రతి నాటక ప్రదర్శనమునకు ముందుగా లైసెన్సు పొందే పద్ధతినములు జరిపిరి. ఈ నాటక ప్రదర్శనలతో ఆ ఆక్టుగూడా దరిమిలా అంతరించినది. ఈ నాటకము నందలి నాటి తిలకు స్వర్గారోహణ ఘట్టము 'గాంధీ మహోదయము' అనే ప్రత్యేక నాటకముగ ప్రకటించ బడినది. ఆనాటి పంజాబు దురంతములకు సంబంధించిన రంగములు (పాంచాల పరాభవము) అను ప్రత్యేక నాటకముగ ప్రచురించబడినది. ఇప్పుడు వెలువడిన యీ నాటకము గాంధీమహోదయ ఘట్టము మొదలు 1935 లో జవహార్‌లాల్ నాయకత్వమున జాతీయ మంత్రులు ఏర్పడు వరకు మాత్రము అసహాయోద్యమమున గాంధీ 'ఉద్యమ విజయాలు' అని వాడుకగా పిలువబడుచున్న ఆనాటి స్టేజి కాపీయే. ఇయ్యది రంగస్థలమున నాటికి నేటికి ప్రదర్శనానుగుణ్యమగు నాటక ప్రతి. అందువలననే రంగస్థల సూచనలుగూడ అక్కడక్కడ లిఖింపబడినవి. ఆనాటి స్టేజిప్రతినియథాతథంగానే కావలెనని ప్రచురించితిమి. ఈనాటక కథావస్తువు ఆనాడు వర్తమానవిషయమే అయినను ఈనాటికయ్యదిపూర్తిగా చరిత్రాత్మకమైనదనుటకు సందియములేదు. అందు వలన ఈ నాటకము శాశ్వతముగ మన జాతీయ స్వాతంత్ర్య విజయానందమును రంగస్థలమున నాట్యమాడించు చుండునుగాక !



## నాటి నటకులు, నాట్యమండలి:—

ఆనాటి మా నాట్యమండలి (శ్రీ) 'సంఘసేవా నాట్యమండలి'. అందలి ప్రఖ్యాత నటకులు కొందరిప్పటికి వయోవృద్ధులు కీర్తిశేషులు అయినను సమాజము సంఘసేవకుమరల సిద్ధముగ నేయుచున్నది. తిలక్ స్వర్గారోహణఘట్టమున తిలక్ పాత్రధరించిన కీ. శే. (శ్రీ) జంపెని శివయ్యగారును, షౌకతాలీపాత్రను తేజవంతముగ నిర్వహించిన కీ. శే. శ్రీ నల్లకొండ జానకిరామయ్యగారును హాస్య పాత్రల నతిరసవంతముగ

పోషించిన కీ. శే. (శ్రీ) ఇటికాల రామశాస్త్రిగారునుచాలప్రఖ్యాత నట కులు. గాంధి పాత్రధరించిన (శ్రీ) పత్రిసీనప్పగారు, భరతమాత పాత్ర ధరించిన (శ్రీ) జగర్లపూడి నరసింహారావుగారు జగమెఱిగినవారే. ఈ పాత్రధారణలో వారు అప్పటికి ఇప్పటికి అద్వితీయులే. మా గాంధి పాత్రధారినిచూచి అసలు గాంధీ అనుకొని జనులు స్టేజీపైకి గుంపులు గుంపులువచ్చిపడేవారు. శ్రీ నిడుముక్కల సుబ్బారావుగారు గూడ బెజవాడ శ్రీ మైలవరం హాలులోను కొన్ని ఇతరచోట్లను గాంధీ పాత్రధరించి వేల ప్రేక్షకులనాకర్షించిరి. ఇక మాలవ్యాపాత్ర ధరిం చిన శ్రీ దిడుగు నరిశింహారావుగారు (అప్పటిపేరు) అచ్చగా మాలవ్యా వలెనే ఉండేవారు. ఆయన ఊపి ఊపి 'To obey the Congress or Not to obey' అనే పల్కులు అప్పుడుచూచిన ప్రేక్షకులు ఇప్పటికి మరువజాలరు. ఇక షౌకతాలీ పాత్రను వర్తకప్రముఖులగు శ్రీ గుంటూరి నరిశింహారావుగారును తరువాత ప్రఖ్యాత నటకులు శ్రీ బసవరాజు సుబ్బారావుగారును అత్యద్భుతముగా నటించేవారు. శ్రీ వింజమూరి శ్రీనివాసాచార్యులుగారు, B.A., B.L., ఆనిబిశెంటు పాత్రను కడుచమ త్కారముగ నిర్వహించేవారు. ఇక హాస్యనటకులుగా (శ్రీ) ఏకా ఆంజనే యులు, శ్రీ ఇటికాల, శ్రీ ఆదినారాయణగుప్తగార్లు ప్రేక్షకులను పరవశు లనుజేసి తమ జేబుల్లో పెట్టుకొని ఇంటికొచ్చేవారు. సంగీతానికి శ్రీ ముక్కామల ముకుందరామయ్య, దాపులూరి నరశింహారావు, కురుచేటి నాగేశ్వరరావుగార్లు కంచుకంఠాలతో ధ్వనిపలికించేవారు. మా హార్మోనిస్టు శ్రీహనుమంతరావు, B. A. గారు. డ్రెస్సరు శ్రీరామ చంద్రరావు. అందరూ దేశభక్తులు త్యాగశీలులే. వారందరికి నాధన్య వాదాలు. దైవానుగ్రహం, ప్రజానుమోదం, ప్రభుత్వాదరణఉంటే మరల నా జీవితంలోనే ఇప్పుడున్న ప్రఖ్యాత నటకులనందరిని రంగస్థలమున చూపగలనేమో. ఆ నాటి గ్రంధములు ముద్రిత ములు అముద్రితములు యింకనూ చాలాఉన్నవి. దేశాభిమానుల

ఆదరణతో క్రమక్రమముగా వాటినన్నిటిని ప్రచురించగలను. నటకు లెవరైనను యీ నాటకమును లాంఛన ప్రాయమైన మాసమ్మతితో ప్రదర్శించవచ్చును.

ఈ నాటకమున వ్యాకరణము పాండిత్యము ఎక్కువగా పాటించలేదు. సహృదయులగు పండితులు మన్నింతురుగాక-నాటక మగుటచే ప్రజారంజకమే ప్రధానముగ నెంచబడినది.

ఈ సందర్భమున మరియొక విషయము-నాటి మాస్వరాజ్య సోపాన గ్రంథములను ఇంకా మాఅముద్రిత జాతీయ రచనలను ముద్రించుటకు ప్రభుత్వ సహాయమవసరమని శ్రీ శ్రీ భో. పట్టాభి శీతా రామయ్యగారు, శ్రీ కాళేశ్వరరావు పంతులుగారు, రాజమన్నార్ గారు శ్రీమాన్ అనంతశయనం అయ్యంగారు మున్నగు అగ్రనాయ కులు కేంద్ర ప్రభుత్వము వారికి వ్రాసిరి. అందు పై కేంద్రసంస్కృతి శాఖామాత్యులగు శ్రీ శ్రీ హుమయూన్ కబీరుగారు నాకొక లేఖ వ్రాయుచూ నా గ్రంథముల ముద్రణకు వలయు ద్రవ్యమునకు యెస్టి మేటు మన రాష్ట్ర ప్రభుత్వము వారి ద్వారా పంపమని కోరిరి. ఆ ప్రకా రము నేను సరియైన యెస్టిమేటు తయారుచేసి మన ఆంధ్రప్రభుత్వ విద్యాశాఖవారిద్వారా ఒకటిని ప్రధానామాత్యులద్వారా ఒకటిన్ని పంపుకున్నాను. కాని వారు నా ఎస్టిమేటును కేంద్రప్రభుత్వమువారి కింతవరకు పంపలేదు. ఈనలభై సం॥ల నుండి ప్రభుత్వమును ప్రతి ఘటించి పోరాడటం బాగాఅలవాటయింది గాని సరిగా ఆశ్రయించటం నాకు చేతగాలేదేమో అనుకున్నాను. మానాటక ప్రచారమును విజయవంత మొనర్చుటయే నాముఖ్యాశయమైనందున శ్రీ అమాత్య శేఖరులందరికి వారివారి ప్రభుత్వములకు పరమేశ్వరుడు పరిపూర్ణాయు రారోగ్యైశ్వర్య విజయ వికాసములు ప్రసాదించుగాక యని ఆసించు చున్నాను. సెలవు, నమస్తే.

ఇట్లు

జై హింద్ గ్రంథకర్త

## శ్రీ దామరాజు పుండరీకాక్షుడు



1920

గ్రంథకర్త :



1956

శ్రీ

# స్వరాజ్య సోపానం




## ["గాంధి విజయం"]

*═══★═══*

## — ప్రార్థన —

శ్రీ - మా - తా - మ - ణీ - రో =

హే భారతమాతా॥

ప్రియజననీ, వరధరణీ, శుభకరిణీ,

పుణ్యా-జనా-శ్రితా - పూతా

పుండరీకవినుతా ॥హే॥

దయగని బ్రోవగ తరుణమిదే

శ్రీ సంఘసేవ వరనాట్యమండలిని,

పావనదేశా, శ్రీవాసా, భూరిదశా,

భక్తయశా, భాగ్యాంశా॥

శ్రీ మా తా మ ణి రో॥

## నాందీ (సూత్రధారి)

శాంతిజ్యోతీం - సకల ఫలదాం ధర్మబద్ధాం - సుహాసాం।
ఆర్యావర్తాం, స్వర్గసదృశాం, భక్తపుణ్యావతంసాం।
భాగ్యానందాం - పరమమహితాం - సస్యసౌందర్యభాసాం।
వందే, ధాత్రీం - భరత జననీం సర్వలోకైక భూషాం॥

ఉ॥ ఎవ్వని శాంతమూర్తియని యెల్ల రనారతమున్ భజింతురో
ఎవ్వ డధర్మమార్గముననించుక యేనియు కాలుపెట్టడో
ఎవ్వడు లోకమంతట నహింసయె యుత్తమమంచు జాటునో,
అ వ్వరమూర్తి గాంధిఋషికంజలిమోడ్చి నమస్కరించుడీ॥

ఉ॥ కత్తులులేవు, శూలమును, గాండివముం మొదలేవియెక్కు నో
రెత్తి ప్రచండ వాక్పటిమ నేనియుఁజాటడు. వైరిమీద దం
డెత్తగ సేనలేదు బలహీనముకాయము, కోపతాపముల్
బొత్తుగసున్న, అట్టి వరమూర్తి, మనోబలశాలి గాంధిఁజే
యెత్తి నమస్కరించి స్మరియించుచ మెప్పు స్వరాజ్య సిద్ధికిన్॥

గీ॥ నవయుగారంభసమయ మానందభరిత
మై చిరునగవులన్ దేలుచనగ, నేడు,
నూతన విశాసమనెడి భానుండదే మ
హోదయంబందె. జయజయనాదములను,
గాంచుడీ, ఇదే, గాంధీయుగంబువచ్చె॥

(సభపై పువ్వులుజల్లి నిష్క్రమించును)

# స్వ రా జ్యో పా స ం

## (గాంధి విజయం)

( ఇంగ్లీషు ప్రభుత్వంవారు నిషేధించిన పూర్వభాగం )

( 1వ రంగము - భారతదేశం, భరతమాత )

[వేషం-హిమవత్పర్వతాకార శిరోభాగం - 4 చేతులు త్రివర్ణపతాకం-త్రిశూలం వ||]

—♦ పాట ♦—

భ.మా:-(స్వ) దేవదేవ దనుజహర దీనసైతి బ్రోవుమా ॥దే॥
యుగయుగముల జగములేల జనన మొందు చుండవా ॥దే॥
స్వేచ్ఛ గోలుపోయి చాలా చింతబొగులు చున్నదాన—
శ్రీరమామణీవిహార చింతదీర్ప భారమా ॥దే॥

అక్కటా! నానాటికి నాస్థితి యెట్లు పరిణమించుచున్నది? భూమండలమునకెల్ల శిరోమణినై కర్మభూమియను ప్రఖ్యాతి వహించి, శ్రీరామ కృష్ణావతారాద్యనేక విష్ణ్వంశ సంభూతులు నాపైడి గర్భమున నుద్భవింప, మహిత చారిత్రనై, నాటి నలహరిశ్చంద్రాది రాజాధిరాజులును నేటి చంద్రగుప్త యశోకాది మేటి మహారాజులును నన్నుగొల్వ, కృష్ణ కావేరి గంగ యమునాది పావన నదీతోయంబుల పవిత్రవంతురాలనై, హిమవన్నగ కైలాస వింధ్య భద్రాద్రి శ్రీశైలాది మహాశైలంబుల నున్నతాసనాసీనురాలనై, చీకు చింత లెఱుగక, నా ముప్పదిమూడుకోట్లకు మించు వివిధ జాతి మత పుత్ర పుత్రికా రత్నంబుల చూచి మురిసికొనుచు, భూతలస్వర్గమోయన విరాజిల్లిన నాకా నేటికీ కడగండ్లు? కటకటా!

శా॥ నావైభోగము, నా మహావిభవముఀ నాస్వేచ్ఛ నాహాయియున్
నావీరత్వము నాతపోఫలము, ఆనాడున్న నాబిడ్డలుఀ

నావిద్యాధనమున్ పవిత్రితయు మాన్యంబైన నాజన్మ నే
డేవీ; యేమయ్యెనో! దీననైతి నకటా, ఇంగ్లీషురాజ్యంబునన్,!

ఇక నాబిడ్డల యగచాట్లు తలచుకొన్నచో నాగుండె బ్రద్దలై పోవునుగదా!

సీ॥ ఒకపూట చేరడేయున్న గంజినిద్రాగి
శుష్కించెడి దరిద్రసుతులజూచి
నాగర్భమునబుట్టి నాయాస్తి ననుభవిం
చగ హక్కులేని నందనుల జూచి
కాలుచేతులు నోరుకదలించుటకు నోచు
కొనని నాదౌర్భాగ్య జనులజూచి
జగదేక వీరుల సంతతికిన్ బుట్టి
దాస్యమోర్చెడి యనాథలనుజూచి

గీ॥ పరుల పెత్తనమున గుందు భరతజనుల
నందరినిజూచి, ధైర్య సాహసములన్ని
కోలుపోయియు, గొల్లున గోలపెట్టు
సుతులజూచియు, నేనెట్లు బ్రతుకుదాన!

ఔరా! ఆ పంజాబు దురంతములు ... ఆక్రూర "డయరాసుర" ఘోరాతి ఘోరములు - ఆ "ఓడ్వాయరు" కిరాతక కృత్యములు - ఎన్నడైన ప్రపంచమున కని విని యెఱుగుదురా - నాగర్భమున ఆ చిచ్చు చల్లారునా-ఈ నాకంటతడి యారునా - ఈ మాయహృదయ శకమెన్నడు మాయునోగదా - దుర్భరము - దుస్సహము - హా! దీన బాంధవా, ఆపద్బాంధవా కృష్ణా, నీవులేవా - నీవేలేవా - నీ భారత మాతను గానా - నన్ను మరచితివా - నా మొఱలు వినబడుటలేదా, లేవా, రావా, వినవా, గనవా, హా, ఆర్తత్రాణ పరాయణా!

మ॥ ఒక పాంచాలికి మానభంగమును నీ వోర్వంగలేకే దురా
త్మకులా కౌరవులందరిన్ వరుసగా దగ్ధంబొనర్పించితో;
ఒక పాంచాలికిమారు నేడకట! యేన్నో వేల పాంచాలురన్
సకలావస్థల పాలొనర్చి వధియించన్ జూతువా యూరకే.

ఆహా ! దయామయా, ఇంకనూ జాలిరాకున్నదా ! ఏమి నా పారబ్ధము !!! పాహిమాం పాహిమాం. (ధ్యానము)

పాట॥ గోపబాల - గోవర్థనగిరిధారీ, శౌరీ
మామక హృదయానందకరా -
భరతపాలనా – పతితారీ కృష్ణా ॥గో॥

(ప్రవేశము – కృష్ణుడు) – (పాట) దూరముగానుండి (మురళితో)

భారత భూమికి పరిపరి వత్తున్ భారము గాదహాహా॥భా॥
భారతయుద్ధము, భారతగీతా, బరపిన స్థలమున
పరుగిడుచుందున్ పాపము పరుగిడుగా ॥భా॥

ఆహా ! భరతమాతయా ! ఎట్టి విషాదము !

సీ॥ ధన ధాన్యముల రాశియను పేరుగోల్పోయి
దీనతన్ గుందెడి దేశమయ్యె
బలదర్పముల మేటి నిలయమౌ ఘనభూమి
పిరికి పందల కిష్ట వృద్ధియయ్యె
పరమ భక్తులకు స్థావరమైన వరభూమి
దేవునే దలపని దేశమయ్యె
దేశ దేశములకు తెన్నుజూపెడి భూమి
సాటివారలనెంతో లోకువనిడె

గీ॥ రాజరాజాధి రాజుల గమ్యభూమి
దాస్యమొార్చెడి యీ దరిద్రార్తిబడియె
అహహా! ఆనాటి రతనాల హైందవంబు
అకట! యీనాటి గతిలేని యవనియయ్యె

(సమీపించి) భరతమాతా! యూరడిల్లుము. పాపవిమోచన కాలము చేరువైనది.

భ.మా:- కృష్ణా! నాదీ స్థితిసిన భరింపలేకున్నాను

సీ॥ నాలోకమాన్యుండు నను బాసి మొన్నండ్లో
చెరసాల వాసంబు చేయవలసె
నా మహాత్ముడు గాంధి ననువీడి "దక్షిణా
ఫ్రిక" కేగి పలుబాములకును జిక్కె
నాధీర లజపతి యీ ధరిత్రిని వీడి
పరభూములను చేరవలసి వచ్చె
నా బెబ్బులుల జంట, నాషౌకతాలీ మ
హమ్మదాలీల్ చెరయందెగలరు.

గీ॥ నాదు ప్రియపుత్రు డరవింద నన్ను విడచి
అడవులన్ జేరె, నయ్యయో! అన్యులింక
ఎందరో దిక్కులేకుండ గుందుచుండి
రక్కటా! దైవమ్మ! బ్రోవుమయ్య వేగ॥

(ప్రణామము - శరణము)

కృష్ణ:- (అభయ హస్తమున) పావనచరితా భరతమాతా! నా గీతా వాక్యముల మరచితివా యేమి?

యదాయదాహిధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థానమధర్మస్యతదా - త్మానం సృజామ్యహమ్,
పరిత్రాణాయసాధూనాం వినాశాయచ దుష్కృతామ్.
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామియుగేయుగే॥

అది యెట్లందువా :—

సీ॥ శ్రీరామ కృష్ణాది శ్రేమావతారముల్
ధరియించి ధర్మంబు నరసినాడ
బుద్ధావతారినై బోధించి ధర నహిం
సా తత్వమును వెదజల్లినాడ
క్రైస్తవమూర్తినై ప్రజలలో సర్వసౌ
భ్రాతృభావంబు నేర్పరచినాడ
ధర మహమ్మదునై మతంబులెన్నైనియు
దేవుడొక్కడె యంచు దెలిపినాడ

గీ॥ కలియుగంబున ధర్మంబు గాచుకొరకు
వెలయుచుందు మహాత్ముల విధముదాల్చి
అందుప్రధమాంశగా తిలక్ నైతి నింక
గాంధిగావలె శాంత హృత్కాంతులలర॥

నేనిదే శాంతమూర్తినై నీ చెంత సర్వదా మెలంగుచు సద్ధర్మంబు ప్రతిష్టించి అహింసా మార్గమున లోకమునుద్ధరించెద. ఒక్కసారి కనులు మూసికొని ధ్యానించితివేని నాసూతన రూపమునిదే తిలకించె దవుగాక॥

[భరతమాత కనులుమూసుకొని తెరచు లోపల -చీకటి- స్టేజిలో కృష్ణుడునిష్క్రమించగా మెల్లగా గాంధి ప్రవేశించును- వేషము-పక్కనుగుడ్డ బొత్తాములు, రాట్నపు నూలు, పొడుగు అంగరఖా - ధోవతి - గుజరాతీ తలగుడ్డ]

గాం :- (తనలో - భరతమాతనుద్దేశించి) పావనచరితా! భరత మాతా! పాహిమాం పాహిమాం.

భ.మా :- (కనులు తెరచిచూచి) ఆహా! గాంధి పుత్రికా, నీవా! ఆనందము, మహదానందము - నీకి దేదిగ్విజయమగుగాక ! విజృంభింపుము - విజయీభవ - విజయీభవ ... ...

పా ట

ఆనందించితిగా, మహాత్మా, నే ॥ఆనం॥
సన్నుతాత్మనీ - శాంతగుణమునకు ॥ఆ॥
సుగుణోద్దామా, జగదభిరామా,
గాంధీమయమగు హైంధవమంది దే ॥ఆనందించితి॥

(భమా - ఆశీర్వదించుతూ నిష్క్రమించుచుండగా గాంధి వైపూలవర్షము- భరత మాతకు గాంధికి మధ్య ప్రత్యేక తెరవాలును]

గాం :- ధన్యోస్మి ! ధన్యోస్మి !

[ఆలోచనానిమగ్నుడై మెల్లమెల్లగా ముందుకునడచి]

(తనలో) ఆహా ! ఆసేతు హిమనగాఖిలలోకైక సురసుఖాలవాలమై, ప్రాచీన విజ్ఞాన, వేదవేదాంగపారీణ, మహాతేజభాసమాన పరమేశ్వర ప్రతిభాసనమై, ముక్కోటి దేవతలకేగాక ముప్పదిమూడుకోట్ల సత్సుతులకు పుట్టినిల్లై, భూలోకస్వర్గమోయనముల్లోకమూర్త్య సౌరభముగ నిత్యకళ్యాణ పచ్చతోరణములతో నిరంతరానందకందళిత హృదయారవిందయై విరాజిల్లిన హైందవ భారతమాతకా. నేటి యీ పడరాని ఇక్కట్లు ! కాలవైపరీత్యము - కటకటా !

ఉ॥ కాలము మారుచున్నది, చికాకుజనించెడు, తోచదేమి, భూ
పాలకవర్గమంతయును పాడయిపోయె, మనుష్యకోటికి

ల్గోలవిపత్సముద్రములలోబడి కొట్టుకులాడుచుండె "ఇం
కేలధరిత్రిజీవన మింకేటికిజన్మ" యటంచుఁదోచెడిన్

......అట్లని కార్యశూన్యులమై యూరకుండుటయా! అట్లొ నర్చుట వైవదోహమును అంతరాత్మకపచారము చేయుటయునగును. భారతదేశమున పూర్వవైభవము నెలకొల్పబడవలసినదే! ప్రపంచము నకు మార్గదర్శకము కావలసినదే! ఈ సమయమున తిలక్ మహారాజే యున్నచో నాకింత భారముండెడిదిగాదు. తోటినాయకులలో అరవింద ఘోష్ మహనీయుడు ఫ్రెంచిరాజ్యమున తపోనిష్ఠయందున్నాడు. దీర్ఘ కాలప్రవాసమనుభవించి లజపతిరాయి ప్రభృతులిప్పుడే కార్యరంగ మున దుముకుచున్నారు. మాలవ్యాపండితుడు అఖండ ప్రజ్ఞాశాలి. ఆనిబిశెంటు విద్యుద్దీపమువంటి తేజోవంతురాలు. అలీసోదరులిప్పుడేజైలు నుండి వెల్వడి నిప్పులుగ్రక్కుచున్నారు. ఇంకనూ ఉత్సాహవంతులగు మోతీలాల్ దాస్ పాలు మున్నగు వీరాధి వీరులెందరోయున్నారు...

ఈ భారత శూరులందరిని ఒక్క వేదికపై చేర్చగల మహా సంస్థ భారత జాతీయకాంగ్రెసు సంస్థయేగదా - కాంగ్రెసే దేశము - దేశమేకాంగ్రెసు! అట్టి మహాసంస్థనే శ్రీదాదాభాయ్ నౌరోజీ మొలకలెత్తించ దానిని లోకమాన్యుడతిప్రేమతో బెంచి పెద్దజేసి మా కిప్పుడప్పగించి వెడలిపోయెను. ఆ మహాసంస్థనే సక్రమపద్ధతులపై నడిపించినచో సత్వరము గమ్యస్థానమును జేరి భారత భావిస్వర్గద్వార ముల తెరచెదముగాక!

( తెరలో - గాంధిమహాత్మకుజై - పాట )

అరుగో దేశీయసోదరులు! వీరికి దేయుత్సాహము గలిగించెద!

[ మరల తెరలో - జై మహాత్మాగాంధీకి ]

[ ప్రవేశం దేశసేవకులు శాంతారాం - జయరాం - ధీరసింగ్ కాంతారావు (విద్యార్థి) పాడుకుంటూ ]

—♦ పా ట ♦—

గాంధిమహాత్ముడె కలది
కాతని కలయగపోదము రారండీ॥
గాంధిమూర్తియే కలియుగ
మంతను కలచిమోక్షమిడు నమ్మండీ॥
అంధమునన్ బడి అణగి
యుందుమొకో ఆర్యతనూజులమనుకోండీ॥
గాంధి మంత్రమే జపియిం
చుదమిక కలసిమెలంగగ కదలండీ॥

అందరూ - మహాత్మా సాష్టాంగ ప్రణామములు -

గాం :- ఎవరునాయనా, దేశ సేవకులవలెనున్నారు-

శాం :- తమ ఆజ్ఞాబద్ధులము, మహాత్మా - తమ దివ్యసందేశమునకై వచ్చితిమి.

గాం :- మంచిది-కాని స్వదేశపరిస్థితులెట్లున్నవి, మిత్రులారా!

ధీర :- ఏమని తెల్పుదుము, మహాత్మా, ఆసేతుహిమాచల పర్యంతముఆబాలగోపాలము తమనూతనోద్యమారంభమున కువ్విళ్లూరుచున్నారు -

జయరాం :- పల్లెటూళ్లలోగూడ స్వరాజ్యకాంక్ష అగ్నిజ్వాలలవలె రగుల్కొని పొవుచున్నది, గాంధీజీ-

శాం :- తమదక్షిణాఫ్రికా ప్రభావమువిని భారత ప్రజానీకము బానిసత్వవిముక్తిపై మీపై గంపెడాశతో ఎప్పుడా ఎప్పుడా యని ఎదురుచూచుచున్నారు.

గాం :- కాని, నా ఉద్యమమంత సులభ సాధ్యముకాదేమో, దేశీయులారా -

శాం :- భారతీయులెట్టి కష్టములైనను సహించుటకు సిద్ధముగా

మన్నారుగాని ఈ పరాధీన పాపానలముమాత్రము భరింపలేకున్నారు. మహాత్మా తమకు తెలియని విషయములేమున్నవి.

సీ॥ సకలసంపదలు నాశనమై తుదకు
సీమ గుడ్డనేడబ్బిచ్చి కొనగవలసె।
జయ :- మనము పుట్టిన భూమి మనముదున్ను కొనంగ,
పరరాజు నాజ్ఞను బడయవలసె।
ధీర :- మనకొండ గుట్టల మన బీళ్లు నడవుల
గొడ్లనేనియు మేపగూడదయ్యె
శాం :- దేవుడిచ్చిన నోరు తెరచి మాట్లాడంగ
ప్రభువుశిక్షకు భయపడగవలసె।

శాం:- గీ॥ ఉప్పునకుగూడ పన్నిచ్చుచుండవలసె,
గుండుసూదులు పెన్నిళ్లుగూడ నితర
దేశములనుండి తెప్పించితీరవలసె।
కటకటా । దేశదౌర్భాగ్యమిటులనుండె॥

గాం:- ధీర్ హై, ధీర్ హై-బహులెస్సగా పల్కితిరి, మిత్రులారా

అందరు :- తమ ఆజ్ఞాబద్ధులము మహాత్మా - కర్తవ్యము సెల వీయుడు.

గాం :- దేశీయులారా, నేనిప్పుడు క్రొత్తగా మీకిచ్చు నూతన సందేశమేమున్నది? - మన కర్తవ్యము సత్యాగ్రహమే - మనదారి ప్రభుత్వముతో సంపూర్ణ సహాయనిరాకరణమే - మన ఆయుధములు అహింస, శాంతము ఈ రెండే - ఆ సత్యాగ్రహవ్రతవిధాన మెట్టి దందురా -

సీ॥ మదకరీంద్రంబులు పదములచేదన్ని
మర్దించి మర్దించిమట్టునాడు,
ఘోరసర్పంబుల క్రోధాగ్నికీలలు
తన్నాహుతిగజేయుచున్ననాడు,

కొంచెరక్కసిమూక గొడ్డండ్లఁజేఁబూని
పరపరకంఠంబు నరుకునాడు,
భీకరాకారగంభీర భూతంబుల
టక్కరి చేష్టలఁ జిక్కునాడు,

గీ॥ భానుడు సహస్రకిరణాస్త్రపాణియగుచు
కారుమబ్బులఁగంపించుకరణిదోఁచ,
పైఁబడెడు దెబ్బలన్ని పుష్పములుగాగ
కత్తిపోట్లు ముత్తెపుసరుల్ గాగమార
"హరిహరీ" యంచు సుంతేని వెఱపులేక
శాంతిమార్గాన నెవడు మోక్షంబుగనెనో
అట్టి ప్రహ్లాదు సత్యాగ్రహ ప్రశంబె
రాజమార్గంబు హైందవ నైజమునకు ॥

జయ :- మహాత్మా, భారతీయుల మందరమును తమ నూతనోద్యమనిర్వాహణమునకు సిద్ధముగనున్నాము.

శాం :- అగ్నిగుండమున దుముకుటకైనను సిద్ధముగనున్నాము. ఈ దాస్యానల జ్వాలలనింక భారతీయులు భరింపలేరు.

మహా :- తైరో, తైరో - నా యుద్యమ నిర్వాహణమంత సులభమైనపనిగాదు - మీ రందరు మీ మీ అంతరాత్మల సాక్షిగ ఎట్టి విషమ పరిస్థితులలోనైనను దౌర్జన్యమునకు గడంగమని ప్రమాణము లొనర్చి ఈయుద్యమమున ప్రవేశించవలయును సుమా!

అందరు :- సిద్ధము-సిద్ధము-అట్లే ప్రమాణమొనర్చుచున్నాము.

గాం:- అట్లయిన మనమందరమును కలకత్తా ప్రత్యేక కాంగ్రెసు మహాసభలో సమావేశమై కార్యక్రమమంతయు నిర్ణయించుదమురండు.

అం :- జై మహాత్మాగాంధీకి!

గాం :- అదుగో - ఇప్పుడే జైలునుండి వెల్వడి షౌకతాలీహూరా

గ్రెసరుడద్దే ఆగ్రహావేశుడై విజృంభించుచున్నాడు. నేనిదేపోయి ఆ ధీరుడుగూడ మనతో మెలంగు నుపాయమాలోచించెద-కాంగ్రెసు మహాసభను జయప్రదమొనర్చెదు - (నిష్క్రమించును)

అం :- మహాత్మాగాంధీకి, భారత మాతాకి, జై!

పాట

( ఒకరు (శాం.) చెప్పుచుండ అందరూ వంతపాడుదురు )

"గాంధి మహాత్ముడె కలదికాతని కలియుగపోదమురారండీ"

పాడుకుంటూనిష్క ... రు ( తెరవాలును)

రంగము - వీధి

[ప్రవేశము దేశభక్తవీరలాల్ ]

వీర :- (స్వ) కటకటా! ఎట్టివిషమపరిస్థితులలో మమ్ముబాసి పోయితివి, బాలగంగాధరా ! లోకమాన్యా,

మ॥ మహారాష్ట్రంబున సింగమో యనగ
జన్మంబెత్తి రారాజు మిం
చు హొరాయల్ గల్గి స్వదేశమాతబడు
సంక్షోభంబు మాన్పింప బల్
మహిమ ప్రజ్ఞలు జూపి లోకమున కే
మాన్యుండనై "జై తిలక్
మహారాజ్కీ" జయజై యనన్
భరత సామ్రాజ్యంబు పాలించితో

జగద్విఖ్యాత శ్రీశ్రీ శివాజీ మహారాజవంశమున సహజతేజోరాశివై వెలసి శ్రీకృష్ణ జన్మస్థానముననే నివాసమేర్పరుచుకొని రెండవ కృష్ణావతారమోయన స్వరాజ్య రణరంగమున కర్మయోగమును సిద్ధాంతీకరించుచు అద్భుత గీతారహస్యముల వెదజల్లి స్వాతం

త్రివిజయోత్సాహ బద్ధకంకణుడవై మావద్భారతభూమినేగాక ఇంగ్లాండు దేశమునగూడ భారతీయుల సహజశక్తి సామర్థ్యముల వేనోళ్ల జాటి భారతావనికి నూతన వికాసమొసగి, అలసి సొలసి అమరలోకాధిపత్యము వహించుటకోయన విశ్రాంతి నొందునట్లొరిగి దేహయాత్ర చాలించితివిగదా ! ఆహా !

సీ॥ అమరలోకాధి పత్యము వహించుట కెవ్వ
రాహ్వానమింతలో నంపిగయ్య
ఇహలోకయాత్ర చాలింపగా నిన్నింత
విసిగించి విసిగించి వేచిరెవరు ?
హైందవుల్ పడుచున్న యగచాట్లు మొరబెట్ట
శ్రీ విష్ణుకడకు వేంచేసితయ్య !
తిలకావతారంబు నిల సమాప్తము జేసి
కలికివై పుట్టంగఁ గాంక్షిటయ్య !

గీ॥ జ్యేష్ఠపుత్రుడ వీవిట్లు సేతువనుచు
స్వప్నమందైన నెంచని శాంతమాత
ఘోష మితిమీరి కుప్పలు కూలిపోయె
భారతంబింక నేరీతి బ్రతుకగలదొ !

( ప్రవేశము దేశసేవకుడు, శాంతారాం )

శాం:- (స్వ) ఓహో, మావీరలాల్ ఏలనో నేడు విచారగ్రస్తుడై యున్నాడు!

( ప్రకాశముగ) మిత్రమా, ఏమిది ఏదియో దీర్ఘాలోచన సేయుచున్నట్లున్నావు?

వీర :- ఏమియులేదు-మిత్రమా! మన దేశ దుస్థితినిగూర్చియే, మూలిగెడినక్కపై తాటిపండుపడినట్లు లోకమాన్యుని మరణముగూడ ఇప్పుడే తటస్థమైనదిగదా !

శాం :- అవును నిజమే, కాని దైవికమునకు మనమంతగా విచారించవలసినపనిలేదు - పరశురాముని దివ్యాంశ శ్రీరామచంద్రమూర్తిలో ప్రవేశించినట్లే శ్రీ లోకమాన్యుని మహత్తర ప్రభావము శ్రీశ్రీ మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ మహాత్మునిలో ప్రవేశించి నట్లును అప్పటినుండియు ఆ మహనీయుడు దివ్యరూపమున భారతదేశ భారమునువహించుచున్నాడనియు వదంతులు నీవు వినలేదా?

వీర :- విన్నానుగాని, నన్నొక సందేహము బాధించుచున్నది మిత్రమా! ఆ మహాత్ముని మెత్తని మార్గములు ప్రస్తుత దేశపరిస్థితులకు సరిపోవునాయను శంక, పెక్కుమందిని కలవరపెట్టుచున్నది, శాంతారాంజీ

శాం :- మిత్రమా ఏమనిపిచ్చి! గాంధి మహాత్ముడకస్మాత్తుగా తన సిద్ధాంతముల నీవేళనే ప్రారంభించెనని తలంచుచుంటివా యేమి!

సీ॥ దక్షిణాఫ్రికయందు ధ్వజమెత్తిశంఖుపూ
రించిఢంకాను మోగించినాడు,
మోగించి, చాంపరాన్ భూమిజయధ్వనుల్
జెలరేగ శిబిరంబు నిలిపినాడు,
నిలిపి, సత్యాగ్రహనీతి భారత భూమి
నెల్లదిక్కుల వెదజల్లినాడు,
జల్లి, వెంటనే స్వరాజ్య రథంబుపై నెక్కి-
శాంతి చక్రముబూని సాగినాడు।

గీ॥ సాగి, హైందవపుత్రుల వేగిరముగ
రండనుచు పిల్చుచున్నాడు, రమ్మువేగ
చంద్రునకు నూలుపోగన్న చందమునను
నడుములు బిగించి పోదము, నడువుమయ్య

వీర :- అట్లయిన మహాత్ముడిదివరకే ఆ ప్రయత్నములో

నున్నాడనన్నమాటే! కాని, శాంతారాంజీ, ననొక్కశంక ఇంకనూ వేధించుచున్నది సుమా!

ఉ॥ "భీకరబాణవర్షమున పెల్లున వైరుల"
ముంచలేదు "మహా
ర్వీకృతగర్జితంబు పృధివీ వియ
దంతరమెల్ల మ్రోగ ను
గ్రాకృతిబూని" వైరిహృదయంబుల
భీతిని గొల్పడాయె, నిం
కేకరణిన్ జయించునుకొ, యెంతొ
బలాఢ్యుల రాజ్యవర్గమున్॥

శాం :- మిత్రమా, నీ వొక్క విషయమెఱింగితివేని నీ సందియములన్నియు దీరును,

మ॥ వరమంత్రం, బఖిల ప్రజాహితము,
శ్రీ ప్రహ్లాదమానీంద్రు ధ
ర్మ రహస్యంబు, జగత్పవిత్రమగు
సూత్రం, బా అహింసామృతం
పు రుచిన్ జూపుచు నాత్మ నిగ్రహములన్
బోధించి దౌర్జన్యమున్
మరువన్ జేయగ విష్ణుమూర్తియె
"మహాత్మాగాంధి" యయ్యెన్ సఖా॥

వీర :- అదియా విషయము! అట్లయిన అరవిందఘోష్ మోతీలాల్, మాలవ్యా, లజపతిరాయ్, బిపిన్‌చంద్రపాల్, చిత్తరంజనదాస్ మున్నగు దేశనాయకులందరూ మహాత్మునితో నేకభవింతురా ?

శాం :- అందులకింకనూ సందేహమా! అప్పుడే ఆసేతుహిమాచలపర్యంతం జాతిమతకులవిచక్షణలేకుండా యావద్భారతీయులూ

గాంధీ యుద్యమమునకై యువ్విళ్లూరచుండ ఇంక మన దేశనాయకులు మాత్రము వెనుకంజ వేయగలరా !

వీర :- శహబాస్ మిత్రమా, ఎంతటి అమృత వాక్కులను బలికితివి - ఇక మనమునూ ఆలసించక అవస్యము మహాత్ముని సందర్శించి కార్యరంగమునదుముకుదమురమ్ము - అదుగో దేశీయులు !

శాం :- ఆనందము, మహదానందము.

ఉ॥ ఎవ్వని శాంతమూర్తియని యెల్ల
రనారతమున్ భజింతురో
ఎవ్వ డధర్మమార్గముననించుక యేనియు
కాలు పెట్టడో
ఎవ్వడు లోకమంతటనహింసయె
యుత్తమ మంచుజాటునో,
అవ్వరమూర్తి గాంధిఋషికంజలి
మోడ్చినమస్కరించుడీ॥

మిత్రమా, రమ్ము మనమందరము వెంటనేపోయి కలకత్తా కాంగ్రెసు ప్రత్యేక మహాసభలో పాల్గొందము.

ఇద్దరు :- జై మహాత్మాగాంధీకి (నిష్క్రి)



# 2 వ రంగము

[ ముస్లిముల సమావేశ మందిరము ]

( ప్రవేశం - షేకతాలీ - ఆగ్రహావేశుడై )

షేకతాలీ :- (తనలో) దౌర్జన్యము-దుండగము-దురాగతము-దురహంకారము — — — ఎట్టి కిరాతక కృత్యము! ఔరా! ఖిలాఫత్ విధ్వంసమా - మా మహమ్మదీయ మతమున కవమానమా - పాశ్చాత్యుల పెత్తనమా - దుర్భగము-దుస్సహము - దురూహ్యము-ఎట్టిమత విఘాతము! రషీద్, వొమార్, వలీద్, ఖాలిఫా రాజమర్యాదలు - మతాచారములు-ఈ అయిరోపియనుల దౌర్జన్యమున అడుగంటవలసినిదేనా!-ఒక్క టర్కీ-రాజ్యమునకేగాక ముస్లిం ప్రపంచమునకే అవమానము - మతమున కవమానము - మహమ్మదీయ మతమునకే అవమానము - మా మతమునకే అవమానమా! బెబ్బులి పిల్లలవలె గంభీర స్వరూపులమై, కొదమసింగములవంటి పౌరుషమూర్తులమై, ఆ మహమ్మద్ ప్రవర్తకు ధీరమానస పుత్రులమై, ఖడ్గముఁ జేతబూని భూమ్యాకాశంబుల గడగడలాడించు మా మహమ్మదీయ ధీరజాతి ప్రతాపమంతయు చల్లారినదే! నేడు స్వేచ్ఛగానుండుటకుగూడ నోచుకొనమైతిమిగా! మా మతమునకు మూలకందమైన మా ఖిలాఫత్‌ను పరులంతరింప చేయుచుండ పిరికి పందలమై తలలొగ్గవలసినదేనా!... ఆ లాయడ్ జార్జి మంత్రిమాటలన్నియు నీళ్లలోమూటలయ్యెను. అహా! ఇయ్యదితుర్కీ-రాజ్య విధ్వంసమే ... ఔరా! ఎంతమాట! ధ్వంసము! రాజ్యమునకే - కాదు - మతమునకే! మహమ్మదీయ మతమునకు!... నాశనమా! - నాకేమో అంతయూ అయోమయమగుచున్నది! ఏమి చేయుదును ... ఏమి చేయుటయూ, దేనికైనను సిద్ధమే-అవసరమైనచో మా యేడుకోట్ల మహమ్మదీయులమును ఈ దేశమును విడిచిపోవుటకును సిద్ధముగానుండవలసినదే! - ఖాలిఫాను రక్షించవలసినదే - లేకున్న ప్రాణములబాయవలసినదే- ... ఎవరి మతము వారు పాలించుకొను

టకు అన్యమతస్థుల అంతరాయమా! ఈ తెల్లదొరల పెత్తనమా!!! పిచ్చి...ఓ ఆంగ్లదేశీయులారా! మీకు మాపై యింతపగయేటికి!... మీరు మా దేశమునకు వచ్చినప్పటినుండియు మీకు మేము దాసోహ మనుచున్నందులకా! ... మొన్ననేగదా మీ ఐరోపా సంగ్రామము నకు వేనకువేలు రూప్యంబులు లక్షలకొలది ప్రాణంబులు, మీ సాయ మునకు, మీ పరువు నిల్పుకొనుటకు, మేము ధారవోసినది... అబ్బా! ముసల్మానుల వేడిరక్తమును మీకై ఎంత ప్రవహింపజేసితిమి!... ఇవి అన్నియు ఎంతలో మరపునకు వచ్చినవి! ... చాలు! చాలు! పొరబడి తిమి ఇక నమ్మము - మా ఖిలాఫత్ - మా మతము! మాపైగంబర్ - మా మహమ్మద్ - అల్లాహో అక్బర్ - (కనులుమూసిధ్యానము) మా మహమ్మదీయ మత రక్షణార్థమై ఎప్పుడు వచ్చెదవు తండ్రీ-అల్లాహో అక్బర్ ...(ఉలికిపడి కనులు తెరచి) ఛీ ఛీ,-ఎవరు గామీరు! మహమ్మ దీయమత ద్వేషులారా! పొండావలకు మా ఖిలాఫత్తును ఎట్లు అంత రింపజేసెదరో జూచెదముగాక! ఇదే మా ప్రతిన,-

శా॥ నేనే పౌరుషజాతివాడనయి
తేనిన్ మామహమ్మద్ సుతుల్
ప్రాణంబుల్ భువిగల్గియున్న
యెడ, ఆర్యావర్త దేశంబిదే
యైనన్, జంకడు పోకతాలి, ఇక
భూమ్యాకాశముల్ డొల్లగా
దానె, రక్క-సకోటినైన నతి
నిర్లక్ష్యంబునన్ దున్ంచడే॥

(అని కత్తిదూసి పైకెత్తగా వెనుకనుండి మెల్లగా గాంధి ప్రవే శించి కత్తిపట్టుకొన్ని)

గాం :- శాంతింపుము, శాంతింపుము ఏమి యీమూఢత్వము. "అహింసా పరమోధర్మః" అని యెఱుగవా! ఇతరులవలెనే నీవును

అహంకారముజూపిన ప్రయోజనమేమి ? కార్యముసిద్ధింపదు. శాంతి మార్గమే జయమునకు రూఢియైన పథముగాని నీవంటి తేజోవంతు లాగ్రహులగుచో విప్లవము వాటిల్లదా ! నెమ్మది వలన సాధించవలె గాని తొందరపడిన ప్రయోజనమేమి.

షౌ :- ఏమి ! తొందరపడుచుంటినా ! పౌరుషపరితాపంబు లన్నియు చల్లారిన మీవంటివారామాకు సలహాలనిచ్చుట. సరిసరి, కనుకనే మనస్థితి యింతహీనముగానున్నది.

గాం :- ఓ పౌరుషమూర్తీ! నీవలె నేను పౌరుషవంతుడ కాక పోయినను నీ ఆగ్రహముపీడి శాంతచిత్తుడ వయ్యెదవేని నీకొక సందే శమును దెల్పెదను.

షౌ:-(స్వ) కట్టా! యీతడు మహాత్ముడని యెరుగక ఏమేమియో యిష్టమువచ్చినట్లువదరుచుంటిని. (ప్రకా) మహాత్మా! తామెంత చెప్పినను నా ఆగ్రహతీవ్రానలమింకను చల్లారకున్నది తామేమిసెలవిచ్చెదరు.

గాం :- ఓ పరితాపమూర్తీ, నీ పౌరుషపటుత్వమున కెంతయు సంతసించువాడ నైనను కాలము నెఱింగియు కర్తవ్యమును దెలిసికొనియు మెలగవలెనని నాకోరిక

ఉ॥ శాంతముపీడి యాగ్రహము సల్పిన కార్యముసిద్ధి జెందునే!
స్వాంతమునందు సర్వము వశంబుననుంచియు గీడుమేలు లా
సాంతముగా నెరింగి పనిసల్పిన మేలగుగాని తొందరక్
గంతులుపెట్టి దూకుటల గల్గునె కోర్కెఫలంబు మిత్రమా॥

మఱియు

మ॥ అలపాశ్చాత్యులబోలె మూఢమతులై యాలంబులన్ జేసి ల
క్షలప్రాణంబుల దీయనెంచుటయె యుక్తంబౌనొకో! నాదుమా
టలనాలింపుము, శాంతిమార్గ మతికష్టంబేయగున్ గాక లో
కులకున్ నేర్పుచు నేర్చుకొన్నయెడ కోర్కెల్ నెగ్గవో యెంచుమీ॥

ఓయీ! పౌరుషాలి! నాయందనుగ్రహముంచి నామనవి విందు
వేని నీయనుమానములన్నియు తీర్చెదను.

షౌ:-మహాత్మా! శాంతము-శాంతమని పలికెదవు. ఇన్నియేండ్లనుండియు పాతుకొనియుండి యంత నిరంకుశాధికారమును సాగించుచున్న యీప్రభుత్వమును శాంతముచే సాధింప గలమనియా మీయూహ.

గాం :- లేక దౌర్జన్యముచే సాధింతమనియా నీతలంపు. దౌర్జన్యమున విశ్వప్రయత్నములు చేయుచున్న ఐర్లాండు దేశమేమి సాధించ గలిగెను ! దౌర్జన్యమార్గమునందారితేరిన జర్మనీ యేమిమూట కట్టు కొనెను ! పాశ్చాత్యులు వేరొకమార్గము నెరుగక దౌర్జన్యమార్గమునే త్రొక్కుచున్నారు. పూర్వము మన తూర్పు ప్రపంచము లోకమునకెల్లదారి చూపెనో యిప్పుడును మన మీ శాంతమార్గమును ప్రపంచమునకు బోధింపవలయును.

షౌ :- మిత్రమా! ఈ యుడుతయూపులకు చింతకాయలు రాలు ననియా మీతలంపు. నెమ్మదిగా మాటలాడుట వలన మనమేమి సాధింపగలము. వారు మనను త్రిప్పి నొక్కుకొలదిని మనము లొంగి లొంగి మెలగవలెననియా మీరు చెప్పుట.

గాం :- షౌకతాలీ! నేను చెప్పెడు శాంతిమార్గము ఉడుతయూపుల వంటిదనియా నీయూహ. నా మతము ముమ్మాటికిని శాంతమే. శాంతిమార్గము ఆత్మనిగ్రహముపై నాధారపడి యుండును. ఆత్మ శక్తికన్న వేరొక మించినశక్తిలేదు. అట్టి ఆత్మశక్తిని మనము స్వాధీనపరచుకొనిన విశ్వమంతయును మన స్వాధీనమైనట్లే. అనగా మన అంతరాత్మను మనము స్వాధీన పరచుకొనిన ప్రపంచమంతయు మనకు లోబడియుండును. అప్పుడు మనకెట్టిబాధలును బాధలుగా తోచవు. అప్పుడు మనకసాధ్యమైనదేదియు గనుపించదు. ఇదియే నాసిద్ధాంతము.

షౌ :- మీరు చెప్పు విషయములు కొంతవరకు నాకు నచ్చినవి, కాని నా మనము వేరొక దారిని పరుగిడ జూచుచున్నది సుమా.

గాం :- మిత్రమా! నీవాలోచించు విషయము రెండవపక్షము. నిజమునకు దౌర్జన్యమవలంబించి మన మేమిజేయగలము! ఆయుధముల వాసనకూడ చూచి యెన్నేళ్ళయినది ? పోనీ ఒకవేళ చేయగల్గినను ఉత్తమమార్గమును విడిచి రెండవపక్షమగు మార్గమున పోజూచుట శ్రేయస్కరమగునా ?

షౌ:- అవును అదియును సత్యమే. నా మనముకూడ ఆలోచనలో పడినది. మీరు చెప్పినవన్నియు నిశ్చయములనియే తోచుచున్నది.

గాం :- మేలు, మిత్రమా ! యింకకొంచము సావకాశముగ విందువేని నా మతమును సంపూర్ణముగ నంగీకరించెదవని నేను నమ్ముచున్నాను.

మరియొకసారి నీ దౌర్జన్యమునుగూర్చి చెప్పెద వినుము.

సీ॥ దౌర్జన్యమున దురంధరుడై నెపోలియన్
జగమెల్ల నేలగా జాలెనొక్కొ
దౌర్జన్యమూని స్వాతంత్ర్యమిడా కమెరికా
నణచి రే బ్రిటిషురాజ్యంబువారు.
దౌర్జన్యమార్గాన దర్పంబుజూపిన
జర్మనీ యేపాటి జయముగాంచె
దౌర్జన్యపథమున దరిజేరగా బోరు
నైర్లాండు దేశమేమయ్యె నేడు

తే॥ గీ॥ ఇచటదౌర్జన్యమునుజూపి యేమిమూట
గట్టుకొందురు రాజ్యవర్గంబువారు ?
వరమమానిందు ప్రిష్ఠోదువరపథంబు
శాంతిమార్గాన సాధింపజాలమేమి ?

మిత్రమా ! మనమింక బోయి శీఘ్రముగ కలకత్తామహాసభకు జేరి, అచ్చట మనసందేశమును దేశమునకు వెల్లడింతము.

సౌ :- మిత్రమా, కాలమునకు కట్టుబడినట్లే, నీ శాంతమునకు గూడ నేను కట్టుబడితిని. ఇంక నీ నూతనమార్గమున నడుగుదప్పక వర్తించెదను. పోవుదమురమ్ము. (నిష్క్రమింతురు)



# 3 వ రంగము

(కాంగ్రెసుభవనము) కలకత్తా నగరము. వీధి.

( బాలభటులు. కాంగ్రెసుసభాలంకారములు:- )

(సిగ్నలు వినబడును.) (బాలభటుల సైన్యము ప్రవేశము.)

(కాం-) నాయకుడు :- బాలభటులారా! కాంగ్రెసుసభాలంకారములుపూర్తి అయినవి గనుక, మనమందరము చిన్నిచిన్ని సంఘములుగ నేర్పడి అవుసరమైన పనులన్నియు చేయుదము. రేపటిదినమే కాంగ్రెసు మహాసభకూడును. ఈ రోజు అధ్యక్షులగు లాలాలజపతిరాయిగారును, మహాత్మాగాంధి మొదలయిన నాయకులు అరుదెంచెదరు. వారికి స్వాగతమొసంగి, వసతుల నేర్పరుచుటకు మనము త్వరితముగ పోవలయును. 1వ నెంబరు ముఠా ధూమ శకటాలయమునకు వెళ్లి వివిధ ప్రదేశములనుండివచ్చు ప్రతినిధుల తీసికు రావలయును. 2, 3, వ ముఠాలవారు సభామండపమునందును, ద్వారములయందును నిలువబడి ఆజ్ఞల నిర్వర్తించుచుండవలెను. 4వ ముఠావారు అత్యవుసర కార్యములకై నిలువలోనుండవలయును. 5 వ ముఠావారు అగ్రాసనాధిపతిగారి యాజ్ఞలో నుండవలయును.

(తెరలో) మహాత్మా గాంధీకిజేయ్. లజపతిరాయ్‌కిజేయ్.

అదిగో నాయకులరుదెంచుచున్నట్లున్నారు. మనమిక శీఘ్రముగ పోవలయును. రండు.

బాలభటులు — (అందరు.)

భూపాళరాగము—చాపుతాళము.

(మేలుకొను మా భరతపుత్రా, ఏలుకో నీ భరతధాత్రి)

1. ''మేలుకొనుమీా భరతపుత్రిడ
మేలుకొనుమీా సుజనమిత్రిడ

మేలుకొనుమిా సచ్చరితపుత్రిక
మేలుకొనుమయ్యా వత్సా ॥మేలుకో॥

2. వేడుకను జాతీయతాయను
వేగుచుక్క పొడిచెనదిగో
కూడి "వందేమాతరం" యని
కుక్కుటము లరచెన్ ॥వత్సా మేలుకో॥

3. అంతటను నవశక్తియనియెడు
కాంతిపుంజము తేజరిల్లెను
మంతనంబున నూతనోద్యమ
మారుతమువీచెన్ ॥వత్సా॥

4. అందరును నీకంటెముందఱ
నడుగులిడుచును మెలగుచుండగ
పందవలె నిటు నిద్రనోవగ
పాడియగునయ్యా ॥వత్సా॥"

5. ఒక్క ప్రాణమె యందరిది మా
దొక్క మనసే యందరిది, మే
మొక్క మార్గమె దొక్కగలమని
నొక్కి వక్కాణించి వడిగా మేలుకో ॥వత్సా॥
మేలుకొనుమా భరతపుత్రా — ఏలుకొనుమా ధరిత్రి"

[ "మేల్కో - ఏల్కో - మేల్కో - ఏల్కో" అను మిలటరీ అడుగుతో నిష్క్రి...రు ]

తెరలో మరల మహాత్మాగాంధికి జై. లజపతిరాయికిజై.
షౌకతాలికి జెయ్ —

తెర లేచును

[మహాసభా మంటపము — త్రివర్ణ పతాకములతో అలంకారము మధ్యన విశాలమైన వేదికపై లోకమాన్యుని ఛాయాపటము — సభలో

30,000 మంది ప్రేక్షకులు-ప్రవేశము-సభముందు వీధిలో నాయకులు ముందు అధ్యక్షుడు శ్రీ లజపతిరాయ్-ఊరేగింపు-బాలభటులు పాడుకుంటూ ముందు నడుచుచుండ]

(ప్రవేశము:- లజపతిరాయ్, గాంధి, షౌకతాలి, నెహ్రూ వగ॥)
( నవరోజు - త్రిశ్రజాతి - ఏకతాళము. )

స్వదేశమాతనీ, పదారవిందముల్
సదామదిన్ భజించెదన్ ముదంబుగూర్పుమా॥
వరాలతల్లి మా మొరాలకింపుమా
బిరాన కనికరానగని, వరాలొసంగుమా ॥స్వదేశ॥
శ్రితార్థిమాతమా, హతారిపూతమా
హితంబుగరపి మముకృతార్థ, మతులజేయుమా ॥స్వ॥

మ హా స భ

[నాయకులొక్కొక్కరు వేదికపై కెక్కుచుండ వారివారి పేర్లతో ॥జై॥ అనుచుందురు - (ప్ర.) గాంధి, షౌకతాలీ, లాలాలజపతిరాయి, పండిట్ మోతీలాలు నెహ్రూ, పండిట్ మదనమోహన మాలవ్యా, బిపిన్ చంద్రపాల్, చిత్తరంజనదాస్, సరళాదేవి, సరోజినిదేవి, అనిబిసెంటు-మొ॥ వారు. ఆహ్వాన సంఘాధ్యక్షుడు (బెంగాలీ వేషముతో) ప్రవేశించును. మిన్నుముట్టునట్లుకర్గతాళములు - జయ జయ ధ్వానములు-]

ఆ. సం - (పుష్పాంజలితో)

గీ॥ భారతీయ మహాజన ప్రముఖులార,
హైందవము నూతన వికాసమందు వేళ
మొలకలెత్తిన చక్కని పూవులార,
దేశభారంబు తలదాల్చు దీక్షబూను
త్యాగధనులార! మీ కిదే స్వాగతంబు

(మహాసభపై పుష్పములుజల్లి పూలహారము చేతగొని)

మహాజన భాయియో, యీ మహాసభకు దేశభక్తాగ్రగణ్యు లగు శ్రీ పంజాబు కేసరి లాలాలజపతిరాయిగారు అగ్రాసనాధిపతిగా లభించినందుకెంతయు ధన్యులము దేశభక్తాగ్రణీ, శ్రీపంజాబ్ కేసరీ,

శా॥ "సింగంబాకటితో గుహాంతరమునన్
జేడ్పాటుమై దోప, మా
తంగస్ఫూర్జిత యోధ దర్శన సము
ద్యత్ క్రోధమై" యొప్పు లీ
లన్ ' గారాగృహవాసఖిన్నమతి
నుగ్రక్రోధమై నేటికీ
రంగంబందున దూకినావె,
లజపత్రాయా, అధిష్ఠింపుమా॥

[పూలహారము మెడలోవేయు కరతాళములు జై జైలు మ్రోగ అధ్యక్షపీఠమలంకరించి-]

లజ :- మాతృదేశారాధనయే పరమధర్మ కర్తవ్యము. మాతృదేశ స్తవము-!

శాం :- ము - బాలభటులు - (ప్రేక్షకులు నిలుచుండగా పాట)

"వందే మాతరం - మాతరం వందే॥
సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్యశ్యామలాం - మాతరం ॥వం॥
శుభ్రజ్యోత్స్నా - పులకిత
యామినీ, ద్రుమదళశోభినీం
సుహాసినీం - సుమధుర భాషిణీం" ॥వందే॥

శ్లో॥ శాంతిజ్యోతీం... ... ... ...

లజ :- నవయుగారంభసమయ నూతనోత్సాహ నవ్యకాంతుల విరాజిల్లుచు, ఆసేతు హిమాచల పర్యంతం యావద్భారతీయ ప్రతిబింబమోయన మెరుపుతీగెబోలి కళకళలాడు ఈ మహాసభామంటపమున నేడీ అధ్యక్ష పీఠమలంకరించవలసిన లోకోత్తర పురుషుండగు శ్రీ లోకమాన్యుని దివ్య స్వరూపముగానరాదయ్యె. ఆ మహామహుని గౌరవార్థమై తామెల్లరు ఒక్కనిముసము నిలువబడి, ఆ మహావీరుని ఆత్మశాంతికై ధ్యానించెదరుగాక ! (అందరు - జై లోకమాన్య బాలగంగాధర తిలక్ మహారాజ్‌కి జై యన తిలక్ పటమునకు పూలమాల వేసి నమస్కరించి)

నాయకాగ్రేసరులారా! మహాజనభాయియో, యీ మహాసభకు నాకన్న నధికులగు వారెందరోయుండ నన్నే అగ్రసనాధిపతిగా నెన్నుకొన్నందుకు మీ కెంతయు కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాడను. దేశము మహాకష్టదశయందున్నది. ముందు చేయదగినపనినిచూడ ఘోరసముద్రమువలె నంతులేనట్లున్నది. ఈ తరుణమందున తిలకుమూర్తిగూడ గతించెను. భారమంతయు ఏ యొక్కగును మోయతగినదిగా గన్పించుటలేదు. ఆసేతు హిమాచలపర్యంతము సర్వప్రాంతములనుండియు విచ్చేసి యీ సభాభవనము నలంకరించిన దేశభక్తులగు మీరందరును కలసిమెలసి బాగుగ యోచించి కర్తవ్యము నిర్ణయించవలెను. విషయము లనేకములుగానున్నవి, —

సీ॥ ఒక్కడే లోకమాన్యుండు లోకమువీడి
పోయె దుఃఖంబింక పోవుటెట్లు
స్వాతంత్ర్యమడుగంటె సౌఖ్యంబు చల్లారె
భరతమాతకు స్వేచ్ఛబడయు టెట్లు
మతమునకవమానము తటస్థమైన మ
హమ్మదీయుల శాంతి నరయుటెట్లు

[వరా :- ఇందలి పాత్రధారులు పద్యములు పాడలేనిచో వచన ప్రయోగమునకు అనుబంధము చూడుడు]

తీవ్రమై పీచు జాతీయ వాతావర
ణము శాంతపడు భాగ్యమమరు టెట్లు

గీ॥ ఆగ్రహము జూపుటకును నిరాయుధులయి
పౌరుషంబూడ బెరుక జీవచ్ఛవంబు
లై మనెడు సోదరులను పంజాబుజనుల
గొట్టి రక్తంబు కాల్వలగట్ట జేసి
నట్టి పరమ కిరాతుల నక్కటకట !
న్యాయమార్గంబునను శిక్షజేయు టెట్లు॥

మరియు

మ॥ కడుసందిగ్ధము కాల, మిట్టితరిజంకన్ భారతీయాశయం
బడుగంటుఙ్, గలుగంగ నేరదు స్వరాజ్యంబింక నెన్నేండ్ల కే
ర్పడగాబోదు స్వతంత్రజీవనము, దూరంబౌను సౌభాగ్య, మె
న్నడుదూామంబిల వీడిపోవదు, మనంగా దుర్భరంబౌ నిలన్.

సభాసదులారా, దేశము నానాటికెట్టి యధోగతి పాలగుచున్నదో ఇంచుకగమనించుడు —

మత్తేభమాలిక

మనశైలంబులనుండి జీవనదులే యేకాలముల్ పారగా
వనముల్ దోట లరణ్యముల్ మిగుల సౌభాగ్యంబు గల్పింప, నీ
ధనధాన్యంబులరాశి, హైందవుల స్వస్థానంబు రాజిల్లుచో
గన నెవ్వారికి కండ్లుగట్టు? విటసౌఖ్యంబొప్ప జీవింపగా
జనినారెందరు లోకు? లెందరిక స్వేచ్ఛన్ వేలనార్జించి పై
కనుపఙ జాలిరి, వర్తకంబునను ద్రవ్యంబెంత కాజేసి నా,
రనికిఙ బోయిన రూకలెన్ని, మనసన్యాయంబుపాల్జేసి నా
శనముఙ సేయగ హేతువెయ్యది, స్వదేశంబందు సేయంగనే

రనివృత్తుల్ గలవే ! దలంచుకొను డార్యావర్త దేశంబనన్
ఘనమెప్పాటిదో! లోకమంతకును మార్గంబెద్ది జూపించెనో
ఘనతన్ నిల్పి, స్వదేశవస్తువులదక్కన్ వేరవర్జింప నె
మ్మనమందొక్కటె దీక్షబూనుకొని క్షామంబిందుఁబోగొట్టనూ
కొనుడీ, సోదరులార, నిశ్చయముకోర్కుల్ వేగమీ డేరెడున్.

సోదరులారా, నానాప్రాంతములనుండియు నమితోత్సాహులై కార్య దీక్ష గైకొనుటకు విచ్చేసిన దేశసేవాదురంధురులగుమీచేనలంకరింప బడిన ఈసభామంటపమునందు భారతీయ నూతన తేజోలక్ష్మి తాండ వంబాడుచు కన్నులపండువ యగుచున్నది. మనప్రస్తుత కర్తవ్యము విషయములో గాంధిమహాత్ముడు సహాయనిరాకరణ తీర్మానమునుప పాదించపోవుచున్నాడు. సమరురగు వేనకువేలు మీరందరుండగా నా అభిప్రాయముముందుగా నొసగుట సమంజసముగాదు. మొత్తముమీద సహాయనిరాకరణ సిద్ధాంతము నంగీకరించువారలలో నేనొకడను. ఆ తీర్మానమునందలి వివిధాంశములను బాగుగా చర్చించి మీరే యీ సభముఖంబున నిర్ణయించవలసియున్నది. ఇప్పటికే చాలకాలాతీత మైనది. విషయనిర్ణయసభ సత్వరము కూడవలయును. విషయము లనేకములున్నవి. కావున నాయుపన్యాసమును చాలించి ఈనాటికీసభను ముగించుచున్నాను. మరల రేపటిదినము మహాసభ కూడును.

(కరతాళధ్వనులు)

(తెరపడును)

—: వీధి :—

[ ప్రవేశం— అధికారి (స్వాభిలాషి) ]

అధి:— (తనలో) స్వాభావ వైచిత్ర్యమేమియో గాని అంత రాత్మ నెంతయణచుకొన్నను అణగియుండదుగదా ! దేశీయ మహా సభను కండ్లజూడకుండ నుండమన్న ప్రాణమొప్పదు. అచ్చటికేగిన

మా మొఖం చూచేవారేలేరు. విషయనిర్ధారణసభలో అడుగు పెట్టుటకుగూడ మాకు ప్రాప్తంలేకుండా పోయింది. పోనీ, సభలో మా ఉపన్యాసలైనా దంచేదామా అంటే మేము లేస్తేనే అల్లరికేకలు. ఎక్కడ చూచినా లోకమాన్యుడు మహాత్ముడు అనే గోలేగానీ మా పేరూ ఊరూ ఎత్తేవారే లేరు. ఇట్లాఅనామకులమై పడియుండేదానికన్నా హాయిగా వేరే ఒక పార్టీని లేవదీస్తే అందులో మనమే ప్రెసిడెంట్లము సెక్రిటరీలము కావచ్చు-. ఈ మహాసభలో మాపప్పులేమీ ఉడికేటట్లు కనపడుటలేదు - ఎవరది? భేషజంగారా, దయచేయండి, దయచేయండి, సమయానికే వచ్చారు.

(ప్రః- భేషజం)

భేః- నమోనమః అధికారిగారూ! ఏం, మీరుగూడా బైటనే ఉన్నారేం -

అధిః- మన రోజులైపోయినవి, మిత్రమా. అంతా గాంధీ మయమూ - ప్రజానీకం యెగబడ్డది -

భేః- ఆ, ఇంత మాత్రానికేనా - ఈ సభలో గాంధిగారితీర్మానాన్ని నెగ్గనిస్తామా -

అధిః- ఏంచేస్తావయ్యా స్వామీ మనని నోరెత్తనిస్తేగా!

భేః- మనమేమిటి, బిశెంటుగారు వ్యతిరేకం - బిపిన్ చంద్రపాలుగారు, చిత్తరంజన్ దాసుగారు వ్యతిరేకం - మాలవ్యా గారు, అటూ ఇటూ ఊగులాడుతున్నారు - ఇక తక్కిన వాళ్లేమి చేస్తారో చెప్పండి - గాంధిగారి తీర్మానం ఖూరం -

అధిః- అంతసులభమైన పని అనుకోకు - మన మిప్పుడొక ప్రత్యేక పార్టీని లేవదీయాలి - ప్రభుత్వంవారి మద్దతుగూడా మనకు చాటుచాటుగా దొరుకుతుంటుంది - అవచ్చేదెవరో చూడు -

భేః- (పారజూచి) ఓహో, మన రావుసాహెబుగారు - వారూ మనలాగే ఉన్నట్లున్నారు వ్యవహారంచూస్తే -

(ప్రవేశం రావుసాహెబు- జరీ తలపాగ, జరీ కండువా, చేతిలో కర్ర, కోటు, బూటు- వేషం)

అధి & భే:- నమస్తే రావుసాహెబుగారూ.

రావుసా:- గుడ్ మార్నింగ్, గుడ్ మార్నింగ్, ఏమిటి విశేషాలు సభకు వచ్చారా -

అధి:- మనని,ఆ,ఆ, మమ్మల్ని రానిస్తేగా-మీకేంలెండి, పెద్దలు

రావుసా:- మా పెద్దరికా లెవరు చూస్తారయ్యా ఇప్పుడు. అయితే మామితవాది సంఘం ఒకటి ఉందిగా, వాళ్లతరపు ఆహ్వానం మీద వచ్చాం.

భే:- మేమూ అందుకే వచ్చాం, సార్,

[ప్రవేశం పోలీస్ సార్జంటు ఖాదర్ సాహెబు - విజిల్ నూదుకుంటూ - చేతిలో లాఠీకర్ర]

అధి:- ఓహో! ఈ సభలో పాల్గొన్నవారికి అరెస్టు లేమైనా వుంటాయా సార్.

రావుసా:- నేనుండగా పరవాలేదులేవయ్యా, కామూష్ -

ఖాదర్:- సలాం సార్, సలాం -

రావుసా:- ఏమిటి, సార్జంటుగారూ, ఏమన్నా హడావుడ్లున్నాయా!

ఖాదర్:- అరే ఇస్కీ, యేంసెప్తార్ సార్, అంతా ఇంతా హడావుడి హంటార్ - పోలీస్ వాడంటే ఫికర్ పోయిందీ సాబ్ -

రావుసా:- అయితే ఇంతకూ సంగతేమిటీ -

ఖాదర్:- హేమీవుందీ సార్, తమ్మీక్ తీస్కో పోటానికే వచ్చాం - జల్దీ రావాలి, సార్ -

రావుసా:- ఎక్కడికయ్యా, మాకేం అరెస్టులేదుగదా!

సా:- హబ్బే, హబ్బే, తమ్మీక్ ఎందుక్ - కలక్టర్ గార్ దర్బారూ సేస్తార్ - తమరూ అర్జంటుగా రావాలీ అని మాకుహుకుం- ఇద్గో హిద్గో -

రావుసా:- ఓహో, అదా సంగతి - మంచి చిక్కే - ఇటు మహా సభ- అటు దర్బారు -

సా:- ఇంకా మీకీ స్నేహితుల్ని గూడా పట్కో-కమ్మనాన్గర్ సార్ - దర్బార్కి మనుషుల్ లేరు, సార్ -

రావుసా:- మిస్టర్ అధికారీ, రండి పోదాం -

అధి:- నాకు డ్రెస్ బాగాలేదు, సార్ -

రావుసా:- పరవాలేదు లేవయ్యా నేనిస్తారా - మిస్టర్ భేషజం, నీవు కాంగ్రెస్ సభలో మెల్లగాదూరి విశేషాలన్నీ మాకు తెలపాలి -

సా:- భేషాజాంగారూ, మీకీ పోలీస్ చేలా ఉద్యోగం ఇప్పిస్తాం - ఉందీ, లేందీ, అంతా అచ్చా అచ్చా సంగత్లు మాకీగూడా పంపిస్తూవుండు.

భే:- ఓ, దానికేంతక్కువ - కుప్పించేయనూ -

అధి:- అయితే, ఆచేతిలోదేమిటి సార్జెంటుగారూ, ఏదోకొత్త ఆయుధం పట్టారే -

సా:- అదీ "లాటీ" అంటాం - మీకీవాంళ్లూ రాటంమీద నూలూనేస్తుంటే మాకీ ప్రభుత్వంలాటీల్ చేస్తుంది సార్ - (తెరలో- మహాత్మా గాంధీకిజై అను కేకలు)

రావుసా:- అరుగో, ఆగాంధి మూకలు మనను చూస్తే వదిలి పెట్టరు - రండి పోదాం -

భే:- వాంళ్లని వలలో వేయటం ఎంతసేపు సార్ - మనమూ "గాంధీకిజై" అంటూఉంటేసరి -

సా:- సరేసాబ్, దబ్నారండి -

(నిష్క్ర.........రు)

కాంగ్రెసుమహాసభ:- కలకత్తానగరము.

30000 జనము.

లజపతిరాయి అధ్యక్షుడు— వేదికపై మహాత్మాగాంధి— నెహ్రూ, షౌకతాలి, పాల్, దాస్, మాలవ్యా, బిశెంటు, సరళాదేవి వగయిరా.

లజ:- మహాజనులారా! విషయనిర్ధారణసభ జయప్రదముగా ముగిసినది. నిర్ణయించవలసిన విషయములన్నిటిని మన నాయకులందరు చక్కగా చర్చించి యున్నారు. ఇక తమ యనుమతికై యీ మహాసభయందుంచవలసి యున్నది. నేటి కార్యక్రమము నందు మహాత్మాగాంధిగారినూతన సహాయ నిరాకరణ తీర్మానము ప్రాముఖ్యమైనది. ఆవిషయమును చర్చించుటకు పూర్వము, మన దేశ నాయకుడును, అఖండ ప్రజ్ఞాధురీణుడును లోకపూజ్యుడును, లోకమాన్యుడును అగు శ్రీ బాలగంగాధర తిలక్ మూర్తి యవతారమును చాలించి స్వర్గస్థుడైనందుకు విచార సూచకముగ మనమందర మొక్క నిముసము నిలువబడ వలయును.

(సభలోయావన్మంది తలదుస్తులనుతీసి నిలువబడి, లోకమాన్యుని పరమాత్మకు శాంతిగలుగుగాక." "తిలక్ మహారాజుకు జైయ్." అని కూర్చుండురు).

లజ:- తదుపరి మహాత్ముడు నూతన సిద్ధాంతము నుపపాదించును. తామెల్లరు నోపికపట్టి ఆయన సందేశమును చక్కగా గ్రహింతురని వేడుచున్నాను.

(కరతాళములు చెలరేగి మిన్నంట గాంధి లేచుచున్నాడు).

గాం:- అగ్రాసనాధిపా! మహాజనులారా! సోదర సోదరీమణులారా! హిందూ మహమ్మదీయ క్రైస్తవ సోదరులారా! నేను తమ యెదుట నుంచబోవు సహాయనిరాకరణ తీర్మానము తమయెల్లరి

కిదివఱకే తేటతెల్లమైన విషయము. ఇంతకుపూర్వము సత్యాగ్రహ వ్రతరహస్యములను తామెల్ల రెఱిగియే యున్నారు. మన సాంప్రదాయమున కనుకూలమైన సిద్ధాంతమును శ్రీప్రహ్లాదమహానీయుండు ఇదివఱకే మనకు జూపించియున్నాడు. ఆ మహానీయుని,

సీ॥ కొండ లెక్కించి పైనుండి క్రిందబడంగ
మించుకోపమున దొర్లించునాడు
హరిదల్ప వలదంచు కరిపదంబులద్రోసి
మట్టించి కడుహింస బెట్టువేళ
బడబానలంబునఁ బడద్రోసి మంటల
కాహుతిగా జేయు నట్టివేళ
కత్తికఠారులఁ గరములన్ బూని పై
పైకి రక్కసి మూకదూకువేళ

తే॥ పైబడెడు దెబ్బలన్ని పుష్పములుగాగ
కత్తిపోట్లు ముత్తెపుసరుల్ గాగ మూర
హరిహరీ యంచు సుంతేని వెరపులేక
శాంతిమార్గాన నెవడు మోక్షంబుగనెనో
అట్టిప్రహ్లాదు సత్యాగ్రహవ్రతంబె
రాజమార్గంబు హైందవ నవ్య జమునకు.

దేశమున స్వరాజ్యసంపాదనకయి యిప్పటికెన్నేండ్లనుంచియో అనేక రీతుల ప్రయత్నించుచున్నాము. కాని అన్ని యత్నములు విఫలము లయ్యెను -

తే॥ గీ॥ సర్వవిధముల యత్నముల్ సలిపి సలిపి
విసికివేసారె ప్రాణంబు; స్వేచ్ఛగాంచు
నాశలేదు పూర్వపుదారులందు జనిన,
జగతికెల్లను మార్గదర్శకముగాగ

నా సహాయ నిరాకరణంబనంగ
నూతనపథంబు మనకు జేయూతనొసగి
కార్యసిద్ధియొనర్చెడు నార్యులార !

సీ॥ గౌరవబిరుదముల్ కాంక్షించుటొక్కటి
సర్కారువిందుకు జనుటయొకటి
పిన్నవయస్కులపిల్చి పిప్పిగజేయు
విద్యకై భ్రమపడు వెఱ్ఱియొకటి
న్యాయంబు పేర నన్యాయంబుగావించు,
కోర్టులపైగల పిచ్చికోర్కె యొకటి,
ప్రజల దాస్యముసూఢిపరచు నూతనచట్ట
మే సర్వమనుచున్న యాసయొకటి
ఇన్ని యేటికి, మన మేమైననుసరే స్వాలా
భముగోరు రాజ్య సంబంధమొకటి.

గీ॥ భరతభూమికిగౌరవ పాత్రములగు।
విషయములుగావు; వానిని విడువవలయు।
జగతిలోమన జన్మదేశంబుగూడ।
పరువుమర్యాదలన్ గల్గి బ్రతికియుండె
ననుచు సూఢిగా దెలియజేయంగ వలయు.

ఇది యది అననేల, ప్రభుత్వమునకు తోడ్పడుటే నిరాకరించవలయు. ఆ విధి ఆసేతుహిమాచల పర్యంతమాచరించెద రేని,

చ॥ అరయుడి యొక్కవత్సరసహాయ నిరాకరణంబు వింటలన్
జరుపు, స్వరాజ్యమప్పుడె వశంబు, ననర్థకభిన్న భావముల్
మరచియు నైకమత్యమున మాతృధరాస్థలి సేవజేసినన్
సరియగు నాదుపద్ధతియె చాలిన యాయుధమిప్డు నమ్ముడీ.

సభ్యులారా! ప్రస్తుతమింతకన్న యెక్కువగా చెప్పుటకు నాకేమియు లేదు. నామితులు ల నేకులు భిన్నాభిప్రాయములను గలిగి

యున్నారు. వారెల్లరు తమతమ యుపన్యాసములగావించినపిదప నాసంకల్పమును మార్చుకొనుటయో లేక వారికి ప్రత్యుత్తరమిచ్చి మీయంగీకారమును వేడుటయో జేసెద. ఇప్పటికింతటితో సెలవుగైకొనెద.

(కరతాళములు)

లజ:- మోతీలాల్ నెహ్రూగారి తీర్మానమును బలపరచెదరు.

నెహ్రూ:- అగ్రాసనాధిపా ఆర్యులారా,

ఈ తీర్మానమునకు మీయంగీకారమును గోరుటకు ముందు కొన్ని ప్రశ్నల నడిగెద. భారతీయులారా, వేవురు పంజాబు సోదరుల నిష్కారణముగ వధింపుటచే రక్తశిక్తమైన హస్తములతోడ మీభుజములపై తట్టి పిల్చుచుండ మీరంగీకరించి పోయి శాసనసభల గూర్చుండ నిచ్చగింతురా ?

సభికులు :- లేదు, లేదు.

నెహ్రూ :- అసత్యములాడ నణుమాత్రమైన జంకులేక మహమ్మదీయ మతమునకు ఘోరమగు నన్యాయముచేసిన ప్రభుత్వమువారి న్యాయస్థానములకేగ నపేక్షించెదరా ?

సభి :- లేదు. లేదు.

నెహ్రూ :- బుద్ధితెలియని పసిపాపల నకారణముగ గుర్రపు కొరడాలతో మోదియు, మండుటెండలో పదునారుమైళ్ళు నడిపించియు, పలుకష్టములు బెట్టినవారి పాఠశాలలకే మీబాలురనంపి మీఆత్మగౌరవమును ధ్వంసము చేసికొననిష్టపడెదరా?

సభి:- లేదు. లేదు.

నెహ్రూ:- లేనిచో, యీసహాయనిరాకరణ వ్రతము నవలంబింపుడు - ఇట్టి ఘోరకృత్యము లింకెప్పుడు జరుగకుండుటకు స్వారాజ్య

మత్యవసరమని బయలు దేరుడు. గాంధిమహాఋషి వాక్యములు వేద వాక్యములుగా గ్రహించి యీతీర్మానము నంగీకరింపుడని మిమ్ముల కోరుచు నా ఆమోదమును వెలిబుచ్చుకొంటిని.

(కరతాళధ్వనులు.)

లజ:- పాల్ గారీతీర్మానమునకు సవరణ నుపపాదింతురు.

పాల్ :- అగ్రాసనాధిపా, మహాసభ్యులారా. నేనును సహాయ నిరాకరణ సూత్రము నామోదించువారలలో నొకడనే. కాని ఆచ రణయందు దించుక మార్పు జేయు నావశ్యకంబెరింగి కొన్ని సవరణలను జేయ నెంచితి. నొక్క మనవిమాత్రము చేసెదను.

తే॥ గీ॥ గాంధిమహనీయునకు మిన్నగానుగాని
ఐన నాకేదితోచు నయ్యదియె దెలుప
సాహసంబున పెద్దలసమ్ముఖమున
బలుక నెంచితి క్షమియింపవలయునుండు॥

నేజేయు మనవి యేమనగా ?

చ॥ తిలకమహామహుం డనుమతించిన నూతన చట్టపద్ధతిన్
సలుపుట పాడియౌనిల, విచారణసేయుడు నాదు భావముల్
తెలుపుదమాంగ్ల దేశమున తెల్లముగా కడసారి “భారతీ
యులకు స్వరాజ్య మిప్పుడిడకుండిన నూతన గాంధిమార్గమే
గలదని” యింతలోదగిన కాలముగల్గును దేశ శిక్షకై॥

మనమీ నూతన సిద్ధాంతము నమలులో పెట్టుటకు పూర్వము ఆంగ్ల దేశమునకు స్పష్టముగా మనయుద్దేశ్యము తెలియజెప్పి మన ఆఖరు ఆశ తీర్చుకొందము. ఈలోపల దేశమును బాగుగ తయారు చేయవచ్చును. శాసనసభలను ఇప్పుడే బహిష్కరించుటకన్న శాసన సభలలో నుండియే ప్రభుత్వము నాటంకపరచుచు ప్రతిఘటనము

సల్పుచుండుట శ్రేయస్కరమని నేను గట్టిగా నమ్ముచున్నాను. ఇందుమూలమున నన్నన్యథాతలంపకుందురని వేడుచున్నాను. పంజాబు దురంతములును, మహమ్మదీయుల ఇక్కట్లును, నామనంబునుండి వీడి పోజాలవు. కాని ఆచరణయోగ్యము నెరిగి యీ సవరణను మీఆమోదమునకై సమర్పించుచున్నాడను.

(కరతాళధ్వనులు)

లజ:- తరువాత చిత్తరంజనదాసుగారు సవరణను బలపరుచుదురు.

దాసు:- అధ్యక్షకా, సభాస్తార్యులారా, నామిత్రుడు చంద్రపాలునికన్న నే నెక్కువగా జెప్పనావశ్యకము లేదు. స్వరాజ్య సంపాదనకు మేమెల్లరమును సంసిద్ధులమై యున్నాము. కాని, ఎద్ది సత్వర స్వరాజ్యప్రాప్తికి సరియైన మార్గమా యని విచారించుచున్నాము. కావున నే చేయుమనవి యేమనగా,

మ॥ గురువర్యుండు తిలక్ మహానృపుడు మీకున్ మాకు దేశంబుకున్
సరి యౌమార్గముజూపియేగె, నతడేసం దేశముల్ దెల్పె న
త్తెరగుల్ సేయుటె యుత్తమంబనుచు ప్రార్థింపగ నే వచ్చితిన్
సరసుండుత్తమ గాంధిసన్మని ప్రశంసార్హుండటంచెంచియుల్॥

కావున తిలకు మహారాజుగారి అభిప్రాయములపై నాధారపడి యున్న మాసవరణను తామందరంగీకరించెదరని ప్రార్థించియింతటితో విరమించుచున్నాను.

(కరతాళములు)

లజ:- తరువాత షౌకతాలీగారుపన్యాసమును గావింతురు.

షౌ:- అధ్యక్షకా, గాంధిమహాత్మా, హిందూముసల్మాన్ సోదర సోదరీమణులారా! నేటి యీ మహాసభయందు మన యిరుతెగల

వారమును కలిసిమెలసి వర్తింపుచున్నందుల కెంతయు సంతసించు చున్నాడను. కాని, మనస్థితిని గూర్చి తలచుకొన్నపుడెల్లను హృదయవేదన రగుల్కొనిపోవుచున్నది. అయ్యో, మన స్థితినిగూర్చి యించుక గమనింపుడు-

సీ॥ కరకుకత్తులబోలు తురకబిడ్డలనెల్ల
ఘరలలోపలమూసి యణచినారు
నైజవిక్రముతైన రాజపుత్రులనొక్క
బోనులో పడద్రోసి మూసినారు
భీమ బలాఢ్యులై పేర్గొన్నఘూర్కులక
కాళ్ళ చేతుల కంట గట్టినారు
వ్యాఘ్రోపమన్ గన్న వంగదేశజులకు
గుడ్డలు నోటిలో గ్రుక్కినారు
రణసింహులైన యారణజిత్తు సంతతిన్
కాళ్ళసంకెలల చే గట్టినారు

గీ॥ పడుచు మగలకు గాజులుదొడిగినారు
ముసలులకు నోళ్ళుగట్టిగా మూసినారు
బుడుతలనుగూడ బంధింప గడగినారు
కటకటా! కష్టమింక దుర్ఘటము సైప
మాతృసేవాపరాయణ మానసులయి
నడుములు బిగించి సేవకై నడువరయ్య॥

సీ॥ ధర్మమార్గాను వర్తనమునన్ బాలించు
రాజులవంశముల్ రాలలేదు,
మిన్నుమన్నుగ జేసి మన్నుమిన్నుగ చేయు
మంత్రివర్గంబెల్ల మాయలేదు;
బలపరాక్రమముల నిలయమై వెలసిన
క్షత్రియాంకుర మెల్ల చాలలేదు,

భక్తి యుక్తులు మంత్రి శక్తిగల్గు మహమ్మ
దీయవంశము పృథ్వి బాయలేదు.

తే॥ గీ॥ కటకటా ! కాని కాలంబు గలిగెగాన
నివురుగప్పిన నిప్పుగా నెగడినాము
నివురుదోసి నిజాగ్ని గన్పింపజేయ
మాతృ సేవాపరాయణ మానసులయి
నడుము బిగియించి సేవకై నడువరయ్య॥

నేడు మా మహమ్మదీయ మతమునకు గొప్పవిప్లవము వాటిల్లినది. తుర్కీ రాజ్యము ధ్వంసమగుటకు సంసిద్ధమైనది- మేము హిందూదేశమున జన్మించినను, ఎచ్చటనున్నను, మామత ధర్మములను విడిచి చరింపజాలము - ఈ ఖిలాఫత్ వ్యవహారము తుర్కీదేశస్థుల కెంత సంబంధించియున్నదో, ఈ దేశమున నున్న 7 కోట్ల మహమ్మదీయులకును, ఇంక ఏదేశముననైననుగల మహమ్మదీయులకును అంతేసంబంధించి యున్నది. ఈవిషయములో మాకనుకూలముగ మాఖిలాఫతున కెట్టి అవమానము లేకుండ పరిష్కారమగువరకు మా జాతికిక నిద్ర బట్టదు -

మ॥ మతవిషయంబులందు ననుమానమి కేటికి ప్రాణముండెనే
ని తురకజాతిహైన్యమవనిన్ భరియింపదు, నేటిమా ఖిలా
ఫతు వ్యవహారముల్ సరి యవశ్యము సల్పినగాని స్వాంత మి
ట్లతిగదపించుటోర్చుకొన దంత నేస్నేహము మాకు నేరికిన్ !

ఓ హిందూసోదరులారా! మిమ్ము నెంతమాత్రమును నిరసించుచుంటి ననుకొనకుడు - మాకు సహాయభూతులయి మాతోపాటు కార్యసిద్ధికి గడంగిన మీ కెంతయు కృతజ్ఞతాపూర్వక సలాములొనరించుచున్నాము - పంజాబునందు జరిగిన దురంతములు మన అందరకిని నిరంతర హృదయ వేదన గలిగించుచున్నవి. ఈవిషయములకు తగిన పరిహారమును జరుగువరకును, ఇట్టి విపరీతము లింకముందు జరుగకుం

దుట కావశ్యకమైన స్వరాజ్యము ప్రాప్తించువరకును మనకు శాంతము గలుగదు - మనమిప్పటిగల వాంఛను శ్రీగాంధి మహాత్ములతో కలసి మెలసి వర్తించిన జయమునిశ్చయము - గాంధిమహాత్ముని సహాయ నిరాకరణ తీర్మానమే మనకు శరణ్యము సత్యాగ్రహ మొందగది, శాంతిమార్గమును ముక్తిగలుగ జేయును అనుకొనుట సాధులకు గాని, యీ మహాత్ముని యుపదేశముల వలన నా అభిప్రాయమును విడిచితిని. సహాయనిరాకరణము మనకు గల యుక్తమును గట్టిగా నమ్ము చున్నాను. కావున నామహామ్మదీయ సోదరులును, హిందూసోదరులును, ఎల్లరును ఈ తీర్మానమును సంపూర్ణముగా నంగీకరించి తత్క్షణమే ఆచరణలో బెట్టెదరని ప్రార్థించుచు, నింతటితో విరమించు చున్నాను.

(కరతాళములు)

లజ :- తరువాత (శ్రీ) బిశెంటు దేవిగారుపన్యాసమును గావింతురు. తామెల్లరును నాపన్యాసమును శాంతముగా యాలకించెదరని వేడు చున్నాను.

బిశెంటు :- (నిలువబడగానే సభలో కల్లోలము)

లజ :- నిశ్శబ్దముగా వినుదురని మరల వేడుచున్నాను. ఎవరినైనను సావకాశముగా వినుట ఉత్తమధర్మము.

బిశెంటు :- సభాధ్యక్షా, సోదరులారా,

(మరల గోల)

మాల :- సభాసామ్యులారా! తమకిది న్యాయముకాదు. భిన్నాభిప్రాయము జూపునంత మాత్రమున గోలచేసి గేలిసేయుట సాధువుకాదు. ఇంతకన్న నెక్కువగా జెప్పగలిగిన వాడనుగాను. దయచేసి ఓర్పుతో ఆమె జెప్పు విషయములు వినుదురని ప్రార్థించుచున్నాను.

బిశెంటు :- మహాజనులారా ! నేనీ తీర్మానమునుగాని, సవరణనుగాని అంగీకరించువారలలో జేరినదానను గాను,

మ॥ భళిరే ! వత్సరమొక్క టే గడచులో స్వాతంత్ర్యమిప్పింతుసనం
చలచాదస్తుడు మీకుబల్కుటయు, వహో! యెంతసుజ్ఞానవం
తులు మీరందరు వానినమ్ముటయు, నెంతో వింతగానుండె చాల్
బలుకన్ సిగ్గగుచున్న దేటి కటులన్ వాపోవుటల్ వెల్లిరో॥

ఎన్నో యేండ్లనుండి, యెంతమందియో తీవ్రప్రయత్నముల జేయగా మనకీ నూతనచట్టము లభించినది. ఇదియే మనకు స్వరాజ్య ప్రారంభము.

చ॥ పరమదయాళు లాంగ్లజనపావను లెల్లరు నూత్నచట్టమున్
వరమణిగా నొసంగిరి, యవశ్యము దానిని స్వీకరించి య
ల్లరులకు పాలుగాక జనులన్ వ్యధబెట్టక హాయి జీవనం
బరయుట శ్రేయమెల్లరికి నప్పుడె స్వేచ్ఛయుఁగల్గు నమ్ముడీ॥

నేను జెప్పువిషయములు మీకిప్పుడంతగా రుచింపక పోయినను ఒకప్పటికైన మీరు విచారింపకపోరు. ఏవరో చెప్పిరని మీ మీ స్వబుద్ధులను విడనాడుట బానిసత్వము. బానిసత్వమునుండి విముక్తులగుటకు కోరుచు, బానిసలుగానుండుట చాల విచారకరముగ నున్నది. ఈ తీర్మానమునుగాని సవరణను గాని అంగీకరించుట క్షేమకరము గాదని మరల నొక్కి వక్కాణించుచు ఇంతటితో విరమించు చున్నాను.

లజ :- నాకత్యవుసర కార్యక్రమములున్నవి - నేంటనే వెడలి పోవుచున్నాను. తరువాత శ్రీమతి సరళాదేవిగా రుపన్యసింతురు.

సర :- అధ్యక్షు కా ! సోదర సోదరీమణులారా ! జడివానకురసి చల్లారినది. అయినను మనపై నేకధారగా గురియుచున్న దుండగమను జడివాన యింకను చల్లారకున్నది. బిశెంటుదేవి మీకిడిన వాక్చాతురీమాధుర్యమును రుచిచూచినపిదప నా చప్పనివాక్కులు మీకురు చింపవను భీతిగలుగుచున్నది. ఐనను, బిశెంటుగారివాక్కులు మనకిప్పుడంతగా రుచింపకపోయినను, ఒకప్పటికైన వానిమాధుర్యము నెరుగు

దుమని యీ దేవి సెలవిచ్చెను. అట్లే రాచయుసిరిఫలమును భుజించు నపుడు వగరుగా దోచినను తదుపరి మంచినీరుత్రాగిన పానకముగా రుచించును. కావున ఉసిరిగ ఫలమునుబోలు బిశెంటువాక్కుల రుచి గొనినపిదప మంచినీళ్ళవలె నిస్సారములైనను నా వాక్కులుగూడ రుచించుననుధైర్యముతో మీయెదుటబల్కుటకు సాహసించితిని.

ఆర్యులారా ! మీపూర్వవైభవము నించుక స్మృతికి దెచ్చు కొనుడు.

సీ॥ దనుజాధములను వాక్కునగూల్చునల పతి
వ్రతల మహాత్మ్యమీవసుధలేదె
ముల్లోకములనేలు మునుల శాపాయుధం
బుల పటుత్వంబెందునిలచిలేదె
పటుపరాక్రమశాలి పంశురామునినాటి
ధైర్యసాహసములీధాత్రిలేదె!
పెనువిపత్తులు సంభవింపగా నవతార
మెత్తి బ్రోచిన హరి యిపుడురాడె

గీ॥ ధర్మమేజయమను నెడు పద్ధతి వహించి
పట్టువిడువక కార్యసాఫల్యమునకు
పాటుపడరయ్య స్వామిపై భారముంచి
హైందవులు వేగస్వాతంత్ర్యలగుదురవని॥

శా॥ ఎందుఁ జూడస్వరాజ్యరాష్ట్రములు నేయే జాతులున్వర్తకం
బందుఁ మేటిదశన్ వహించుటయు నీపాప్రియంబునందక్కటా
హిందూసుందరి యొందుడాగె సమయంబె తెంచె నిప్పట్ల నో
హిందూనందనులార లెండు, వడిరండీ, మాతృసేవార్థమై॥

శా॥ కందోయిఁ దసపుత్రులఁ గను చుసౌఖ్యానందముఁ బొందు చుఁ
డెందంబందు చికాకెరుంగక మొ బల్ శీవిన్ విరాజిల్లు నా

హిందూసుందరి యెందుడాగె సమయంబే తెంచె నిప్పట్లనో
హిందూనందనులార లెండు వడి రండీ మాతృ సేవార్థమై॥

శా॥ ముందే మేమనిహిందువుల్ నడువ మేముఀ ముందుగానున్న చో
బందెంబంచు మహమ్మదీయులొక చెంపఀ రూఢిగాబల్క ఆ
ముందేసిక్కులు పారశీల్ నడువ, మేముఀ మేముమేమంచు నా
నందంబొందుచు మాతృసేవకయి పూనన్ స్వేచ్ఛమైనుండు నా
హిందూసుందరి యెందుడాగె సమయంబే తెంచె నిప్పట్లనో
హిందూనందనులార లెండు వడిరండీమాతృ సేవార్థమై॥

మహాజనులారా, నేను శ్రీ మహాత్ముని అసలు తీర్మానమును బలపరుచుచున్నాను.

లజ:- తరువాత శ్రీమతి సరోజినీ దేవిగారుపన్యసించెదరు.

సరో:- సభాస్థార్యులారా! గాంధిమహాత్ముడు తన యుద్యమము నందు ఆడువారికి అవకాశ మెక్కువగా గలిగింపనందులకు చింతిలుచు చున్నాను. మీకొక్క విషయమును మనవి జేయుచున్నాను.

సీ॥ నరకాసురుని వధించగ కృష్ణుడేగుచో
సత్యయే యాలంబు సలుప లేదొ,
పరమేశు నర్ధాంగి పార్వతిసర్వదా
భర్తచెంత నె సిల్వాబడగ లేదొ,
అతిసాహసముబూని పతికయి సావిత్రి
యమునితో పరలోక మరుగ లేదొ,
తనభక్తిశక్తిచే ద్రౌపది శ్రీకృష్ణు
ప్రత్యక్షునిగ జేసి ప్రబల లేదొ,

(పురుషుల నుద్దేశించి)

గీ॥ భారతీ యాభ్యుదయమందు పాల్గొనంగ
ఆడువారికి మీయంత హక్కు గలదు;

(స్త్రీలనుద్దేశించి)

స్త్రీజనములార నిద్రబోఁజెల్లదింక
దేశసేవారతులరై తేజరిలుడు॥

సీ॥ అక్కలారా! ఇంకనైన మీపతులు న్యా
య స్థానముల కేగుటాపరమ్మ
అమ్మలారా! మీ ప్రియతనూజులను పిల్చి
సిండెడు విద్యమాన్పింపరమ్మ
సోదరీమణులార! మీదు సోదరులకు
గాంధిసందేశంబు గరపరమ్మ
భారతీదేవి పుత్రీరత్నములు మీరు
మాతృదౌర్భాగ్యంబు మాన్పరమ్మ

తే॥ గీ॥ తనయు లుద్యోగముల జేసి దాస్యవృత్తి
ధనము నార్జింతు రను నాశ గొనకుడమ్మ
మాతృదేశాభిమానంబు మానసముల
వెలయగా బిడ్డలను ప్రేమఁ బెంచరమ్మ

కీర్తన.

వినుడు సుగుణులార, నావిన్నపమీతీరు
మనవిజేసెదన్ మీ దేశము మరువకండికను మీరు॥ వి॥

మానంబెటులైనను గాపాడుకొనన్ వలయు
ఆపై భువి స్వేచ్ఛగాంచు భాగ్యము లభియించు
ఈ ప్రాణంబు లింకెందుకు మనమాతను సేవింపక
ఇంకేనాటికి కరుణ నాయీశ్వరుడిద్దర గనునో॥ వి॥
ఇలకు మనము సేవసేయుటింకను గావలయు రా
గల జన్మజన్మములసుఖంబు గోరవలయు ॥ వినుడుసుగుణు॥

కావున, పిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు, హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు— ఎల్లరును ఏవిధమైన భేదములను విడనాడి, యీ మహాయజ్ఞ సమయంబున గాంధిమహాత్మునకు తోడ్పడెదరని ప్రార్థించుచున్నాను. (కరతా॥)

లజ:- తరువాత పండిత మదనమోహన మాళవ్యాగారుపన్యసించెదరు.

మాల:- (కరతాళధ్వనులు) అగ్రాసనాధిపా! ఆర్యులారా! తామెల్లరు శాంతభావముతో నేజెప్పువిషయములన్నియు వినుదురని ప్రార్థించుచున్నాను. సహాయనిరాకరణ సిద్ధాంతము నామోదించువారలలో నేనొకడను. కాని, ఆచరణ భాగమందు కొంచెము భిన్నాభిప్రాయమును గలిగి యున్నానని మనవి చేయుచున్నాను. కావున నన్ను వృథా తెలంపవద్దు.

సీ॥ పంజాబుహత్యలు ప్రజల శోకాబ్ధిలో
ముంచెనం చెరుగక పోవ లేదు,
తుర్కీసమస్య హిందూమహమ్మదుజాతు
లను కలంచుటెరుంగ నట్టియగాదు,
దేశప్రభుత్వమా దేసించు కృత్యంబు
లతిఘోర మంచెరుంగకయు గాను,
స్వాతంత్ర్యసిద్ధిసత్వరము ప్రాప్తించు
నావశ్యకం బెరుగని వాడగాను,

గీ॥ అన్ని విషయములెరిగియే యున్నవాడ
బానిసత్వవిముక్తి సంప్రాప్తమగుట
యెన్నడాయని కడు వేచియున్నవాడ
కాని యెద్ది దేశక్షేమకారి యెరిగి
అటులవర్తింప నాతురమందువాడ॥

మరియు,

చ॥ భయపడి వెన్కదీసెడు స్వభావము నాయది గాదు దేశసే
వయె నను గోరెనేని యిదె ప్రాణము లీయగ సిద్ధమైతి, సం
దియములు బారదోలక యనిశ్చయ మార్గము జొత్తుమేని యెం
తయుఁ దలక్రిందులౌదుము, యదార్థ మెరింగియు సంచరింపుడీ॥

మ॥ ఇపుడో యింకొక కొన్ని రోజులకొ వారే వారి దుశ్చర్యలన్
విపరీతంబులుగా నెఱింగి యుపశాంతిన్ జేసికోవచ్చు, మీ
రిపుడీ తీవ్రపుచర్యలన్ సలుప యేదెట్లౌనొ మున్ముందికే
విపరీతంబులు పుట్టనున్నవియొ మీ విద్యుక్తముల్ నిర్ణయిం
చి, బలిన్ సల్పుడు దేశసౌఖ్యమిపుడే చేకూరునట్లయ్యెడన్॥

గీ॥ గాంధిమహనీయు నే నెఱుగనొకొ, అతడు
మానిపర్యుండు, శక్తిసామర్థ్యములను
వెలుగు లేకుండ వెలిగెడు విశ్వమూర్తి;
ఆమహాత్ముని జ్ఞానమహాత్తు జగతి
సర్వసామాన్యులకుఁ గల్గసాధ్యమగునె॥

కావున, మనశక్తి సామర్థ్యముల ననుసరించియు, దేశక్షేమమును మరువకయు, ఆచరణయోగ్యము లెరిగియు, మనకనుకూలమగు మార్గమున వర్తించుట శ్రేయస్కరము. తిలక్ మహామహుని అవసాన దశయందాయనను జూచుభాగ్యము నాకు లభించె. అప్పుడాయన జాతీయవాదులెవరును శాసన సభల బహిష్కరింపరాదని స్పష్టముగా తెలియజెప్పెను. ప్రస్తుత తీర్మానవిషయములో బిపిన్ చంద్రపాలుగారి సవరణ దే. నా భావముల కనుగుణ్యముగ దోచుచున్నది. కావున తమరెల్లరు ఆ సవరణ నంగీకరింతురని వేడుచున్నాను. దేశభారమంతయు భరించెడు నీ మహాసభను జయప్రదముగా నెరవేర్చెదరని నమ్ముచు ఇంతటితో విరమించుచున్నాను.

లజ:- మహాసభ్యులారా! తీర్మానము విషయమును. సవరణను గూర్చియు చర్చ బాగుగ జరిగినది. [illegible] యభిప్రాయము

లన్నియు బయల్పడినవి. ఇప్పుడు గాంధిమహాత్ముడు తనకడపటియుప న్యాసమును గావించినపిమ్మట, మీ యందరి యనుమతులును లెక్కింపబడును. గాంధిమహాత్ముడు తన రెండవ యుపన్యాసమును గావించెదరు.

గాం:- ఆర్యులారా! సోదర సోదరీమణులారా! హిందూమహమ్మదీయ సోదరులారా! నా మిత్రులందరనేక విధంబుల భిన్నాభిప్రాయములు వెలిబుచ్చిరిగాని, మదీయోద్యమమును మార్పుజేయగల ప్రతివాద మొక్కటియును వినియుండలేదు. కొందరు నాయుద్యమ మసాధ్యమని యందురు. అసాధ్యమనగా నర్థమేమియో నెరుంగవలయు. ప్రయత్నించినను చేయలేనిది యసాధ్యము. మన ప్రస్తుత యుద్యమ మట్టిదిగాదు.

మరియు ప్రభుత్వముపట్ల మన అయిష్టము ననేక విధంబుల దెలుపవచ్చుననియు, సహాయనిరాకరణము వలన నెక్కువయేమియు గలుగనేరదనియు కొందరందురు.

మ॥ అలపంజాబున స్త్రీలు బిడ్డలను వ్యత్యాసంబులేకే తుపా
కులగాల్పించిన క్రూరచర్యలకునాక్రోశంబు; ఇస్లాంమత
స్థులకున్ జూపిన ద్రోహభావమునకున్ జూపించు రోషంబు మా
టలసాధింతురె ? భారతీయుల ప్రతిష్టన్ నిల్ప యత్నింపరే॥

పంజాబు దురంతము లోకచెంప నిరంతర హృదయవేదనను గలిగించుచుండ, రెండవ విషయమగు ఖిలాఫతు వ్యవహారము త్రోసి వేయదగినది కాదు.

చ॥ అరయమహమ్మదీయులును హైందవులిద్దరు నేత్రయుగ్మమై
వరలుదు, రందునొక్కరికి బాధలు రెండవవారివౌను, నీ
రిరువురు నైకమత్యమున నేకముగా విహరింపకున్న, పొం
దరికస్వారాజ్యమెన్నటికి దాస్యవిముక్తియు గల్గదెప్పుడున్॥

ఇప్పుడు మహమ్మదీయమతమునకు గొప్పవిప్లవము వాటిల్లినది. ఈ సందిగ్ధసమయమున వారివిషయము మనవిషయముగా గ్రహించి వారికి తోడ్పడవలసిన భారము మనయందున్నది. నూతన మాంటేగ్యూఛమ్స్ఫర్డు చట్టమును గురించి యించుక ముచ్చటింతము:—

తే॥ గీ॥ భారతీయుల రక్తప్రవాహమందు
తడసినకరంబులన్ ప్రసాదమునొసంగ
రుచికరంబౌనె మీరెయెఱుంగవలయు,
వరమణిగ నూత్నచట్టంబు నరయ నంత
రాత్మ యొవ్వానే, పంజాబుహత్యఁదలప॥

కొందరు మిత్రులు శాసన సభలయం దేమియో తలక్రిందులు జేయవచ్చునను వ్యామోహమునఁబడి యున్నారు. ఇప్పటి కిన్ని యేండ్లనుండియు శాసన సభ లేమి జేయగలిగెనో ఇకముందు నంతే జేయుగలవు. అదియునుగాక,

గీ॥ గడియ యేడాదిగాజూడబడుచునుండు
కాలమందున రిక్తతర్కంబులందు
విందులన్ జేరి నంతిస మెుందుటందు
కాలమును వ్యర్థబుచ్చగాగలమె యిపుడు॥

శాసనసభ లెట్లు బహిష్కరింప బడవలయునో, న్యాయస్థానములును, ప్రభుత్వ విద్యాలయములు నట్లే తక్షణము బహిష్కరింప బడవలెను. న్యాయస్థానములను పేరుగలిగి అన్యాయస్థానములుగ సార్థకమై యున్నవి. ప్రస్తుతన్యాయస్థానము లన్యాయ స్థానములు గాక మరియొకటిగాదని అందరును ఆమోదించు విషయమే. అదిగాక, దేశ సేవ జేయుటకు న్యాయవాదులకు తదితరులకన్న నెక్కుడవకాశము లున్నవి. కావున సత్వరముగ న్యాయవాదులు తమ తమ వృత్తులను మాని దేశసేవకై గడంగవలయును.

...లు భారతీయులను జేయు విద్యాలయములుకావు. పాశ్చాత్య పద్ధతులపై నాధారపడిన విద్యాలయములు. అచ్చటి విద్యార్థులు దిట్టమైన నౌకరులయ్యెదరుగాని చక్కని స్వాతంత్ర్యము ననుభవించుచు, పౌరసత్వపుహక్కుల గాపాడుకొనుచు స్వేచ్ఛగా జీవించు దేశభక్తులు గాజాలరు. కావున ప్రస్తుతరాజకీయ సంపర్కముగలవిద్యను సత్వరము విసర్జించి పవిత్రవంతులుగావలెను.

మరియు, నామిత్రులు కొందరు కొన్ని సందర్భముల యందు తిలక్ మహాత్ముని నామము మదీయోద్యమమునకు వ్యతిరేకముగా నుపయోగించిరి. ఆమహారాజు వాక్కు వేద వాక్కు గావున నా మిత్రులకు గల దురభిప్రాయమును సవరింపవలయును ఆయన అవసాన దశయందాయనను జూడగా, మహమ్మదీయులందరును సహాయ నిరాకరణ సిద్ధాంతము నాచరణలో బెట్టుటకు సిద్ధమైన, తానును తన పక్షమువారును తప్పక వారితోపాటు వర్తింతుమని సెలవిచ్చిరి. అట్టి యెడ నామిత్రులకేల యీ దురభిప్రాయము గలిగెనో ఆశ్చర్యముగా నున్నది. ఈవిషయమున సందేహమున్నవారు ఒక్కసారి కనులు మూసి ఆమహాత్ముని దివ్యవాక్కులు దలపోసిన చో వారి అంతరాత్మలకే నిజము తేటతెల్లమగును — (మహాత్ముడు కనులుమూసికొని ధ్యానమునభినయించు చుండ ప్రేక్షకులలో ఒక ఆవేశుడు తన్మయుడై లేచి)

ఆవే:- నిజము మహాత్ముని మాటలాలింపుడు.

లజ:- కామూష్ - ఎవరది ?

ఆవే:- నన్ను మీరు మరచితిరా - నేనే తిలక్ మహారాజును - మహాత్ముని అభిప్రాయమే నా అభిమతము వినుడు - వినుడు (సభలో గోల).

లజ:- ఆవేశునివలె నున్నాడు. కూర్చొనబెట్టుడు. సభాసదులారా! శాంతింపుడు.

(ఆవేశుడు గడగడ వణుకు-- . గారివలె ప్రబోధము)

ఆవే:- శా॥ మీలో మీరలు పోరుచుంటికిదియా
మేలైన కాలంబు, క
ల్లోలంబై జగమెల్ల తల్లడిలగా
లోకంబు స్వాతంత్ర్యతా
లోలంబౌ తరుణంబు మీరిటులఁగో
ల్పోవంగ న్యాయంబొకో,
మేలున్ గీడును గుర్తెఱింగిమనుడీ
మీ రైకమత్యంబునన్

క॥ జనవాక్యమె కర్తవ్యం
బనువాక్కులనమ్మ అఖిలహైందవ కాంగ్రెస్
జనవాక్య మెఱిగి దెలిపెడు
మనవిని శిరసావహించిమనుడీ ఘనతన్

(కరతాళములు - "వినుడు - వినుడు" తిలక్ మహారాజ్కు జైయ్.)

లజ:- ఆవేశుని శాంతింపజేయుడు - మహాజనులారా! శాంతము.

గాం:- (ఆవేశుని జూచి) అత డావేశుడైనను అతడు పల్కు దివ్య వాక్కులు వందనీయుడగు శ్రీ తిలక్ మహారాజుగారివే. సోదరులారా! యింకను వేయిశంక లేటికి. పూర్తినమ్మకముతో నాతీర్మానమూమోదింపుడు. (కరతాళములు)

లజ:- సవరణయు తీర్మానమును బాగుగ చర్చింపబడినవి. సవరణపై తమ అభిప్రాయము.

చాలమంది:- వలదు – వలదు.

లజ:- తీర్మానము.

చాలమంది:- అందరు, అందరూ.

లజ:- తీర్మానమూ మోదింపబడినది.

మహాజన భాయియో,— ఇక ఈతీర్మానము నమలులో బెట్టు భారము వివిధ ప్రాంతములనుండి విచ్చేసిన దేశసేవాధురంధురులగు మీపైనున్నది. మూడుమాసములలో రానున్న నాగపుర కాంగ్రెస్ మహాసభనాటికి తీర్మానమునకు దిగ్విజయము చేకూర్చెదరు గాక యని హెచ్చరించుచు జాతీయ ప్రబోధముతో యీ మహాసభను ముగించుచున్నాను. యీమాం టేగ్చూ ఛమ్సుఫర్డు విధానము ననుసరించి జరుగనున్న శాసనసభా ఎన్నికలుపూర్తిగా బహిష్కరింపబడునట్లు ప్రచార మొనర్చి మహాత్ముని అసహాయోద్యమ తీర్మానమునకు దిగ్విజయము చేకూర్చి స్వరాజ్యసౌధమునకు ప్రథమ సోపానము నధిష్టించెదరుగాక.

(రెండు జాబులందించెదరు)

మహాజనులారా! సంతోషవార్త, మహాత్ముని తీర్మానానుసారము మదరాసు తమిళ నాయకులగు శ్రీ సేలం విజయరాఘవాచారిగారు తమ శాసనసభా సభ్యత్వమునకు రాజీనామా నిచ్చుచున్నట్లు తెలియజేయుచున్నారు. (కరతాళములు). ఇంకనూ, –

ఆంధ్రదేశ నాయకులగు శ్రీ దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు తమ వ్యతిరేకాభిప్రాయమును వదలుకొని ఉద్యమమును ఆంధ్రలో దిగ్విజయముగా నడిపించెదమని దీక్షబూనుచున్నారు.

(కరతాళములు)

(జాతీయప్రబోధము)

శాం దే. సే :- జయ్ గాంధీ మహాత్మకు జై.

— అందరూ —

—♦ పాట ♦—

వరభూమి మన పుణ్యదేశంబురా
భరతమాతకు సేవ భాగ్యంబెరా॥

1. భూలోకమునకెల్ల ముత్యంబురా
ఖ్యాతలంబున సూర్య-చంద్రులురా
భరతతల్లి మనకు సర్వంబురా॥
భరతజాతిదె పేరు ప్రఖ్యాతిరా॥

2. ధీరులనుగన్న పృధ్వీస్థలమురా
వీరమాతాయనెడు పేర్గాంచెరా
మానులనుగన్నట్టి మన తల్లిరా
క్షత్రియులు వెలసిన శౌర్యాద్రిరా॥

3. భరతవంశముగన్న పౌరాత్మరా
పదియునవతారముల పావనియెరా
భీష్మద్రోణులగన్న పృధ్వీమణిరా
భీమార్జునులు వెల్లు ప్రియభూమిరా॥

4. మంత్రశక్తికి గొప్ప యంత్రంబురా
పతిభక్తిశక్తి గొప్పకు మేటిరా

కర్మయోగము కగ్రగణ్యంబురా
సత్యగ్రహవ్రతా సద్ధర్మరా॥ వర ॥

జై భారత్‌మాతాకీ, జై మహాత్మాగాంధీకి.

(తెరపడును)

# *Interval*

# విశ్రాంతి



# ద్వితీయాంకము

## 4 వ రంగము

### (ప్రి) మహమ్మదాలీ

మహమ్మ:- (స్వ) కటకటా! ప్రాణము విసిగివేసారినది - దేశదేశములును తిరిగి తిరిగి చేయగల ప్రియత్నములు అన్నియు చేసి తుదకు నిష్ఫల మనోరథుడనై యిల్లుచేరవలసె మహమ్మదీయమతమునకు గలిగిన అవమానమును న్యాయమార్గమున తొలగింప ప్రయత్నించుట నిష్ప్రియోజనమయ్యెను. కొన్ని దేశములవారు పల్కిన పల్కులు తాత్కాలికోత్సాహము గలిగించి ఆశనించుక నిలిపెనుగాని తుదకు వారి వారి నిజహృదయములు బయలుపడి మోసపోతిమి. ఐనను మనవిద్యుక్తమును మనము నెరవేర్చితిమి జరుగబోవు కీడు మేలులకు పాశ్చాత్యులే కారణ భూతులుగాని మనమెంతమాత్రిమునూగాము మహమ్మదీయుల హృదయవేదన నానాటికి రగులుకొనుచుండ హిందూదేశ దుస్థితి రోజు రోజుకు అసంతృప్తియగుచుండ ఐరోపాదేశీయులు ప్రిపంచ శాంతిని నెలకొల్పుటకై నానాజాతి సమ్మేళనము స్థాపింతురట. అది యెట్లుకొనసాగునో వారికే తెలియును. అమెరికావారీవిషయమెరిగియే వారి అనుమతిని చూపించుటలేదు- ఇట్టితరి ఐరోపియనులొక్కరే యెట్లు ప్రిపంచిక శాంతిని స్థాపింతురో హాస్యాస్పదముగనున్నది. ఇంక చేయు కర్తవ్యమేమియో యోచింపవలయును. దేశాంతరమున మేము ప్రియత్నములుచేయుచుండ దేశములో గాంధి మహాత్ముడును షౌకతాలీ సోదరుడును చేయుచున్న ప్రియత్నములు వర్ణనాతీతములు అవును. స్వశక్తిపై ఆధారపడియుండుటకన్న వేరొక సన్మార్గ మేమున్నది! స్వశక్తియే పరమశక్తి స్వశక్తియే ముక్తిదాయకము స్వశక్తియే మానుష లక్షణము. కావున స్వశక్తిపై నాధారపడియున్న యీ

సహాయనిరాకరణోద్యమమును సంపూర్ణముగ దిగ్విజయమొనర్చితీర వలయును హిందూ ముసల్మానులొక్కటి కావలయును. అదుగో నా రాక నెరింగి షౌకతాలీ సోదరుడిటే వచ్చుచున్నాడు అల్లాహో అక్బర్! ఆదాబ్ బడా భయ్యా !

షౌక :- (ప్రవేశించి) (కౌగలించి) ఛోటాభయ్యా, క్షేమముగ నరుదెంచినందులకు సంతసించుచున్నాను. విశేషములేమియు లేవుగదా!

మహా :- సోదరా! మన అల్లాకృపయుండుటంజేసి క్షేమముగా నిల్లుజేరినాను.

షౌక :- ప్రియత్నములేమైన ఫలించెనా ?

మహా :- సోదరా ! పాశ్చాత్యుల స్వభావ 'మెరిగియు ఫలించెనా అని అడుగుదువేల ? మన విధిని మనము నెరవేర్చితిమి అదియే మనకు కలిగిన ఫలితము.

షౌక :- నేననుకొనుచునేయుంటిని యేమియూ ఆశలేదుగదా !

మహా :- మన స్వశక్తిపై నాధారపడుటయే మన ఆశ ఇక్కడ విశేషములేమి ?

షౌక:- మన ఖిలాఫత్ వ్యవహారము ఇంగ్లీషువారిచే చక్క చేయబడదని నేనిదివరకేగ్రహించి మహాత్ముని నాయకత్వమున తీవ్రమగు అసహాయోద్యమము సాగించుచున్నాను. ప్రథమ శాసనసభా యెన్నికలు భగ్నముకానున్నవి. ప్రభుత్వ పాఠశాలలు పడుకొనుచున్నవి. న్యాయస్థానములు నిద్రపోవుచున్నవి జైళ్ళు నిండిపోవుచున్నవి.

మహా:- బేషక్ సోదరా! ఆలీసోదరులన్న అఖండవిఖ్యాతి అంబరవీధిని మారుమ్రోగవలదా ?

షౌ : మహ:- జై - హిందూ ముసల్మానుకు జై - అదుగో మహాత్ముడు.

( ప్రి-గాంధి )

గాంధి:- అలీసోదరులారా! అల్లాహూఅక్బర్.

మహ:- ఆదా-ఆప్ ఆరజ్ మహాత్మాజీ! ఆప్కా దర్శన్ కే లియే హం ఇంతిజార్ కర్ రహే హై.

గాం:- మహమ్మదాలీగారి పరదేశప్రయత్నములు సఫలమైనవి కాబోలు.

మహ:- మహాత్మాజీ! ప్రభుత్వమువారు మాటలకు లొంగుదురా. నావిధిని నేను నెరవేర్చితిని. ఇక్కడ మీయుద్యమముచక్కగా సాగుచున్నట్లు పత్రికల మూలమున తెలిసికొనుచున్నాను. నేను యీవరకే పరదేశ నివాసమువల్ల చాలా ఆలస్యం చేసినందుకు విచారపడుచున్నాను.

గాం:- నా యుద్యమ మేమిటి? మీ యు ద్య మ మే దేశీయోద్యమము అనండి. I am in your pockets. మీ జేబులోనే నేనున్నాను.

మహ:- No No We are in your hands మహాత్మాజీ మీ చేతిలోనే మేమున్నాము.

గాం:- అలీ సోదరులారా! మనము కాశీ సమావేశమున చేయవలసిన పనులనేకములున్నవి. శీఘ్రముగపోయి అక్కడముచ్చటించుకొందము రండు.

(మహాత్ముడు మధ్యనిలుచొని చెరియొకరి భుజములపై తన చేతులు మోపి నిష్క్రమింతురు.)

—: రంగం కాశీ :—

(తెర లేచును ప్ర. మాలవ్యా ఆలోచనానిమగ్నుడై)

మాల:-(స్వ) To obey-or-not to obey ! ఒప్పుకొనుటయా తిరస్కరించుటయా! కాలమతి వేగముగ పరుగిడుచున్నది! స్వాధీనము తప్పిపోవుచున్నది! దేశీయోత్సాహము ప్రవాహముతై పారుచున్నది! ప్రభుత్వమువారి పట్టుదలయు ప్రజ్వరిల్లుచున్నది! ఇంక కర్తవ్యమేమి?

కలకత్తా మహాసభ తొందరపడి తీర్మానమంగీకరించిన దేమో? కాంగ్రెస్ తీర్మానము నంగీకరించుటయా, తిరస్కరించుటయా! To obey or not to obey is the question. ఒప్పుకొన్నచో అంత రాత్మకు వ్యతిరేకము! ఒప్పుకొననిచో దేశద్రోహము! అబ్బా, అన్నియూ క్లిష్టసమస్యలే. ఏది యెట్లున్నను జాతీయోత్సాహ ప్రవాహము నాపుట కెవరివశము? శాసనసభల కేగుటయా. బహిష్కరించుటయా. సభల కేగుట కాంగ్రెస్ తీర్మానమునకు విరుద్ధము-బహిష్కరించినచో వ్యతిరేకులు సభలో దూరి దేశమునకపకారము చేయనచ్చును. ఇది మరి యొక క్లిష్టసమస్య. శాసనసభలకేగినను నిష్ప్రయోజనమే. గవర్నరుల ప్రత్యేకాధికారములు ప్రజా ప్రభుత్వమునకు శిరచ్ఛేదనాంశము. అబ్బ! అన్నియు క్లిష్టసమస్యలే. మహాత్ముని అభిప్రాయములు సమంజసములే చూచినకొలదియు నామనస్సుగూడ మహాత్ముని వైఖరికే మరలు చున్నది. ఏది యెట్లున్నను మహాత్ముని ఉద్యమము అన్ని ప్రాంతము లందును దేదీప్యమానముగ రగుల్కొనిపోవుచున్నది గదా. ఈ మహావ కాశమును జారవిడుచుట శ్రేయస్కరమా. అబ్బ! అన్నియు క్లిష్ట సమస్యలే. రాజకీయోద్యమ నిర్వహణ మెంతకష్టమైనది. విద్యాలయ ముల బహిష్కారము-విద్యార్థులసమ్మె- విప్లవములు- కాశీ హిందూ విశ్వవిద్యాలయము! విద్యార్థులను విచ్చలవిడిగా పోనిచ్చుట క్షేమ కరమే - కూడదు- కూడదు. ఈ నాగపురమహాసభయందైనను బహి

ష్కార విధానమును మార్చవలసినదే ఓహో దేశబంధు వచ్చు చున్నాడు. ఇతని వైఖరి యెట్లుండునో తెలుసుకొనెదగాక.

( ప్రవేశము దాస్ )

దాస్ :- సీ॥ ఏవాడ నరసినన్ దేవి భారతమాత
సేన సేవయటంచుఁ జెవుల బడెడు
ఎందుజూచిన తిలక్ ఎచట గాంచిన గాంధి
మహనీయ నామముల్ మహిఁజెలంగు
ఏపార్శ్వమునగన్న నెల్ల జాతులలోన
సర్వసౌభ్రాతృత్వమూర్తిఁ జెలగు
ఎచ్చోట గాంచిన ఇపుడే స్వరాజ్యంబు
గావలెనను గట్టికాంక్షవాడమె

గీ॥ కాంగ్రెసను పేరు వినగ నేకమయి జనులు
సంబరముతోడ జోహారుసల్పు చుండ్రి;
ఇతర పార్టీలు తలయెత్తు గతులు లేక
వెనుకబడు చుండె ! ఉత్సాహజనకమహహా॥

మాల :- దేశబంధూ

దాస్ :- పండిట్జీ

మాల:- కర్తవ్యమో ?

దాస్ :- కర్తవ్యము కాంగ్రెస్ తీర్మానము నాగపుర మహా సభలో మార్పించుటయే శాసన సభా బహిష్కారమును చాలించుటయే.

మా :- అందుకు మహాత్ముడంగీకరింపనిచో.

దాస్ :- మహాత్ముడైనను సరే మరి యెవరైననుసరే మా

వంగదేశ ప్రతినిధులము సిద్ధముగా వచ్చితిమి తీర్మానమును మార్చవలసినదే కాంగ్రెస్‌ను విడిచిపోవుటకల్ల. కాంగ్రెసునకు వ్యతిరేకముగా నడచుట ఆత్మహత్యయగును.

మా :- భేష్ చక్కగా పల్కితివి అడుగో మోతీలాల్ నెహ్రూ పండితుడు. (ప్రవేశ నెహ్రూ)

నె :- ఏమిది ? మిత్రులారా! ఇంకను దీర్ఘాలోచన సేయుచున్నారా ? మహాసభా తీర్మానము సర్వజనామోదితముగదా ?

దాస్ :- కాదు, ఆ తీర్మానమును మేము మార్పు జేసెదము.

నె :- ఓహో ! మీరు ప్రత్యేకము రైలుబండినిండ ప్రతినిధులనుగొనివచ్చినది అందుకొరకా ?

దాస్ :- అవును అందుకొరకే.

నె :- మహాత్ముడంతకట్టిగా జెప్పుచున్నప్పుడు ఆతని విధానమునకేల అవకాశ మొసంగగూడదు చిత్తరంజనా ?

మా :- కాని ప్రభుత్వము వారికి మరియొక అవకాశమిచ్చిన నో వారి వైఖరిని వారే మార్చుకొందురేమో మిత్రమా.

నె :- మిత్రులారా ఇంకను మీకట్టి ఆశ యా

సీ॥ డాల్హౌసి ప్రభువు మాటల పసజూపించి
వాగ్దానముల నెన్నొ భంగపరచె
విక్టోరియారాజ్ఞి ప్రేమతో నొసగిన
ప్రకటనన్ ఖర్జను భంగపరచె
అహహ ! నేడు మన లాయడ్ జార్జి
మనకండ్ల పట్టపగలెదుమ్ము గొట్టలేదె
వారువీరన నేల ప్రభుసాంప్రదాయమే
మోసభావమునందు మునిగిలేదొ

గీ॥ అట్లుకాదేని నీతిగలట్టివారి
వేళ్లు మడిచిచూపించుడీ, బ్రిటీషురాజ్య
వర్గమందున ? మాంటేగ్యు ప్రభువెయగునో !
"డయ్యరోడ్వ్యయరు" లగుదురో ! వెయ్యియేల
నెవ్వగేనెయుగలరేమొ ఎంచరయ్య॥

అదిగో ఆదేశీయోత్సాహమును జూడుడు. మిత్రులారా,

మా :- చూచుచున్నాము, చూచుచున్నాము. నేత్రానంద ముగ జూచుచున్నాము.

దాస్ :- ఈ మహోత్సాహమునే శాసన సభలలోగూడ జూడవచ్చును.

నె :- దేశమంతయు గాంధీ మయమగుచున్నది. మిత్రులారా!

( ప్రవేశం దేశసేవకులు )

దే. సే. లు. (శాం-)

— పాట —

శ్రీగాంధి నామాం మరువాం, మరువాం,
సిద్ధము జైలుకు వెరువాం, వెరువాం
కూడి. భారతమాతా, గొలుతాం, గొలుతాం
నేడే స్వరాజ్యాన్ని తెస్తాం, తెస్తాం శ్రీగాంధి॥

మా :- పాడుడు, దేశీయులారా, పాడుడు

దె. సే (శాం) పాట —

దేశభక్తులు మాకూ సారాం, సారాం॥
దేశద్రోహులు మాకు దూరం, దూరం
వర గాంధీ మార్గాన్నే వదలాం, వదలాం
వేరేమార్గాలన్నీ వదిలేం, వదిలేం

లాటీదెబ్బలకేము బెదరాం, బెదరాం,
మేటీతుపాకీకి చెదరాం చెదరాం
శ్రీ గాంధీ నామాం మరువాం మరువాం॥

మాల :- పాడుడు దేశీయులారా, మహానందమున పాడుడు శంకించకుడు, మేము మీకు వ్యతిరేకులముకాము.

శాం :- మహనీయులారా, మీ నాయకులెల్లరూ మనస్ఫూర్తిగా ఈ మహోద్యమమున పాల్గొనని దే మాకు తృప్తిలేదు.

దాన్ :- మేమెల్లరము మనస్ఫూర్తిగా మీతో నున్నాము. సందేహించకుడు.

మా :- మాస్వల్ప అభిప్రాయభేదములతో మీకు పనిలేదు మాజీవమే కాంగ్రెసు, కాంగ్రెసే దేశము - దేశమే కాంగ్రెసు నిశ్చింతగా పాడుడు దేశీయులారా !

శాం :- ఈ ప్రథమశాసన సభా యెన్నికల బహిష్కారములో నే కాంగ్రెసునకు దిగ్విజయముగూర్చెదము, దేశీయుల యుత్సాహము నెంతమాత్రము సందేహింపకుడు.

దాసు :- మంచిది మీ యుత్సాహమును సాగించుడు.

శాం :- జేయ్ మహాత్మాగాంధికిజై

—: పాట :—

"శ్రీ గాంధి నామాం మరువాం మరువాం॥"

(పాడుకుంటూ నిష్క్రి. రు.)

నె:- ఇంకనూ వెనుదీసి ఇట్టి మహావకాశమును జారవిడుచుటయూ మిత్రులారా!

మా:- పాఠశాలల బహిష్కారమే నన్ను బాధించుచున్నది.

దాన్:- శాసనసభల బహిష్కారమే నేను శంకించుచున్నాను.

నెహ్రూ:- అదుగో మహాత్ముడు.

(ప్రవేశ:- మహాత్ముడు, షౌకతాలీ & మహమ్మదాలీ)

గాం:- ఏమిది మిత్రులారా! వృధాచర్చలతో యింకనూ కాలమును వ్యర్థంబుచ్చుటయా?

సీ॥ నానాటికి ప్రభుత్వమేనీతియెరుగక
రాక్షసరాజ్యమై గ్రాలుచుండె
రోజురోజుకు మన రాజకీయవిధాన
మతినీచదశకు పాలగుచునుండె
అంతకంతకు న్యాయమడుగంటుటయెగాక
తప్పుదారుల ప్రభుత్వంబునడుచు
చూడచూడగ ధర్మశూన్యమై రావణా
సురునిచర్యలు జ్ఞప్తిజొచ్చుచుండె

గీ॥ దాస్యబంధములు బిగింపుదాల్చుచుండె,
జీవనమె దుర్భరంబుగ జేయబడియె,
అక్కటా! ఇట్టి రాజ్యాంగమవని నింక
అంతరించుట లోకకళ్యాణముగద॥

మా:- కర్తవ్యమును నిర్ణయించుకొనవలదా మహాత్మాజీ?

గాం:- ఇంకనూ నిర్ణయించుటయా.

గీ॥ సమయమే తెంచె భారతజాతికెల్ల
శంకలనుమాని కర్తవ్యసరణిదెలిసి
స్వార్థమతివీడి దేశసేవార్థమిపుడె
నడుములను గట్టవలయు హైందవులు వేగ॥

దాస్:- ఇందు స్వార్థమును గోరువారెవరునూ లేరు మహాత్మాజీ.

మ॥ తలపకుమెన్న డేని, ఇలదాస్యము
గోరు మహానుభావులఁ గలసెడువాడనం
చు, వెనుకంబడు వాడనుగాని దే, స్వ
తంత్రిలమగు మార్గమేదియును తొందర
పాటుజనించె, ఏపనిన్ సలుపుట కేని
సిద్ధము విచారమికేటికి రండఁవచ్చెదన్॥

గాం:- శహబాష్! ధీరాగ్రెసరా! నీవే వెనుదీసినచో, దేశ సౌభాగ్యమెట్లు చేకూరును.

నెహ్రూ:- ఓహో! మహమ్మదాలీగారి రాక మహమ్మదీయులను మరింత యుత్సాహమునకు పురిగొల్పునుగాక.

షౌక:- ఆసందియమే మీకక్కఱలేదు. మా మహమ్మదీయులెన్నడును వెనుదీయువారు కారు.

దా:- శాసనసభా విషయమే నన్ను బాధించుచున్నది మిత్రులారా,

గాం:- అది స్వల్పవిషయము. ఈనాగపుర మహాసభలో సంపూర్ణస్వాతంత్ర్యసిద్ధాంతము నంగీకరింపదలచితిమి. నీకది యుత్సాహహేతు వేగదా!

దాస్:- అంతకన్న కావలసిన దేమున్నది. కాంగ్రెస్ తత్వము నే మార్చెదుము.

మహమ్మ:- మీ యిష్టమువచ్చినట్లు నిర్ణయింపుడు. నేనెల్లప్పుడు మీతో ముందంజవేయుటకు సిద్ధము నేనిదేపోయి మహమ్మదీయ మహాసభగావించి వచ్చెదను.

గాం:- మంచిది. ఈప్రథమ శాసనసభా ఎన్నికలలో బహిష్కారము జయప్రదముగ సాగినట్లు వార్తలేమైన వచ్చినవా!

(ప్రవేశము శాం. రాం.)

శాం:-

ఉ॥ సంతసమార్యులార పలు - సందియముల్ విడిపోయె భారతం।
బంతయు గాంధిమానికి జయంబును-దిగ్విజయంబును గూర్చె, ధీ।
మంతులు హైందవప్రజల మా - నసమిద్ధరనిల్చె. నూత్నసి।
ద్ధాంతమునమ్మి యెన్నికల తా - కగలేదు జనంబు లెచ్చటన్॥

గాం:- వివిధ ప్రాంతములనుండి విశేష వార్తలరుదెంచినవా?

దే. సే:- ఎచ్చటనో ప్రభుత్వోద్యోగులును, స్వాభిలాషులును, మూఢాంధులును. మితవాదులమనువారునుదక్క- వేరెవ్వరు యెన్ని కలలో పాల్గొనలేదు. వోట్ల ఆఫీసర్లు ఆరుగంటలవరకు కూర్చొని కూర్చొని, ఖాళీపెట్టెలతో యిండ్లకు పోయినారు. ఆంధ్రరాష్ట్రము అమితోత్సాహము చూపినది. పంజాబ్, బీహార్, సంయుక్తరాష్ట్రములు, తదితర రాష్ట్రముల నిదివరకే మిగిలిపోయినవి. కాంగ్రెసునకు అఖండవిజయము చేకూరినది. నేటి వార్తా విశేషములన్నియు చాల సంతోషముగ నున్నవి.

మా:- శాసనసభా బహిష్కారమున కాంగ్రెసుకు సంపూర్ణ విజయము చేకూరినట్లే.

దాస్:- అవసరమైనచో మహాజనులు కాంగ్రెసు సభ్యులకే తమవోటు నిత్తురనుటకుగూడ సందియములేదు.

నెహ్రూ:- అవసరమైనప్పుడు అట్లే చేయుదము. ప్రస్తుత మా విషయమున చర్చ అనవసరము. కర్తవ్యమూహింపుము, మహాత్మా!

గాం:- ఇంకనూ ఊహించుటకేమున్నది? ఈ పయోముఖ విషకుంభ "మాంటేగూ్యఛమ్స్‌ఫర్డ్" సంస్కరణలు సమసిపోయినట్లే.

గీ॥ చక్క ని స్వరాజ్యసౌధంబు నెక్కుటకును
పరిధను సోపానమును జేరి ప్రిబలహర్ష
మున తరింతము, వెనుకకు పోవుమాట
చెవులబడరాదు వడివడి జేరవలయు
మోక్షసౌధంబు, హైందవ పుత్రులారా॥

కాంగ్రెసు మతమును మార్చెదము. సంపూర్ణ స్వాతంత్ర్యము నంగీకరింతము. స్వదేశదీక్ష వహింతము. పన్నుల నిరాకరించుట వరకు పూర్తి సహాయ నిరాకరణ తీర్మానమమలుజరిగింతము. ఈ నాగపుర మహాసభ దేశమున చరిత్రాత్మకమగుగాక ! యింకను మీ సందేహము లేమి ? మిత్రులారా !

మా:- విద్యార్థుల విషయము మహాత్మాజీ.

దాస్ :- అది స్వల్పవిషయము పండిట్జీ. నేనే సంపూర్ణ సహాయ నిరాకరణ తీర్మానము ప్రిసాదించెదను. మా వంగరాష్ట్రము వెనుక పడదని లోకమెరుంగుగాక.

నె :- ఆనందము మహానందము, పండిట్జీ ఇక వెనుదీయకుము. స్వల్పవిషయములావల నిర్ణయించుదము.

మా :- ఆ! నేనా వెనుదీయునది. రంతు వృద్ధుడనయ్యు మీతో నెంతదవ్వైనను రాగల శక్తిసామర్థ్యములు నాకు లేకపోలేదు.

గాం :- మాకన్న తమకెక్కువ యుత్సాహమేయున్నది పండిట్జీ. (నవ్వుతూ) విషయములన్నియు దేశపరిస్థితులే నిర్ణయించును. పోవు దము రండు.

అందరు :- సిద్ధము – సిద్ధము – (నిష్క్రమింతురు)

శాం॥రాం॥ ఆహా! ఏమి యీ మహాత్ముని అద్భుత మహాత్మ్యము!

శాం-ఉ॥ కత్తులు లేవు. శూలమును గాండివమున్ మొదలేవియుశక్తి, నో
రెత్తి ప్రచండ వాక్పటిమ నేనియుఁజాటకను, వైరిమీద దం
డెత్తగ సేనలేదు, బలహీనముకాయము, కోపతాపముల్
బొత్తుగనున్న అట్టిపరమూర్తిమనోబలశాలి, గాంధిఁజే
యెత్తి నమస్కరించి స్మరియించుడిమెప్డు స్వరాజ్యసిద్ధికిన్

( లో తెర పడును )

రంగము - వీధి - నాగపుర ప్రాంతము. రావుసాహేబ్

రావు, సా :- (ప్రవేశించి) (స్వ)

అయిపోయింది - మన పనంతా, అయిపోయింది - ఇక మన పప్పులుడకవు - కలకత్తా మహాసభలో మన మాటసాగలేదనుకుంటే ఈ నాగపుర మహాసభలో మనం ప్రవేశించటానికే వీలులేకుండా అయిపోయింది - దేశంలో ఇక మన ఆటలు సాగవు. ఈ గాంధీగారి అగ్నిపరీక్షలోను మనమంతా ఆహుతి కావాలిసిందే. మన సర్కారు బిరుదాలు పొట్లాలు కట్టుకోవాలిసిందే - ఆల్పేకా కోట్లు చలి మంట వేసుకోవాలిసిందే - మీటింగులలో మెదలటానికే వీలులేదు. కౌన్సిళ్లలో కాలు పెట్టనివ్వరు. ఎక్కడచూచినా గాంధీగారి కోలాహలమే - మనమాట తల్చేవారా, పిల్చేవారా- ఖద్దరు, జైలు, లాటీదెబ్బలు - ఇవియే దేశసేవకులకు ప్రథమ పరీక్ష-అవంటే మనకు భయం-దర్జాగా ప్లాట్ ఫారంమీద లెక్చర్లిచ్చ్యమంటే దంచెయ్యవచ్చు - ఇప్పుడువినే వాడెవడు. ( ప్రవేశం - అధికారి )

అధి :- ఏమండోయ్ రావుసాహేబ్‌గారూ, అలావున్నారేం! దాసుగారు నాగపుర మహాసభలో గాంధిగారిని ఓడించాల్నని స్పెషల్ ట్రైనులో డెలిగేట్లను పట్టుకొచ్చారటగా.

రావు.సా :- ఆ, అయింది ఆయనపనీ గాంధిగారి యెదుట పడటంతోటే తల్లక్రిందులుగా చల్లబడి పైగా తానే సంపూర్ణ స్వాతంత్ర్య

తీర్మానంతో పాటు పూ ర్తిసహాయ నిరాకరణ తీర్మానమునుగూడ మహా సభలో ప్రవేశ పెట్టాడు.

అధి :- అయి తే మాలవ్యాగారో!

రావు :- మాలవ్యాగారా! "చూచిన కొలదిగ మహాత్మునికి చేరువయయ్యెడు నామనంబు" అంటూ ఊసులాడి ఊసులాడి ఆ జాతీయ ప్రవాహంలోపడి నెహ్రూగారితో పాటు కొట్టుకుపోతున్నాడు.

అధి :- అయితేయేంలేవయ్యా, ఇంకా బిశెంటుగారు లేదా మన మితవాద ప్రముఖులు లేరా ?

రావు :- ఓరి పిచ్చివాడా, ఇంకేం మితవాదులూ, ఇంకేం బిశెంటూ. స్వాతంత్ర్యులూ గాంధిగారి అనుచరులూ కలిసి కాంగ్రెసు 'క్రీడు' అంటే తత్వం మార్చటంతోటే బిశెంటుగారు అడియారు ప్రవేశించింది. మితవాదులు కొన్నాళ్లు ప్రవేశించారు. చివరకు దేశ మంతా గాంధీ మయమే అయింది.

అధి :- ఆ మార్పు చేసిన తత్వమేమిటి బాబూ?

రా. సా :- ఇదివరకు స్వరాజ్యమే కావాలెననీ, ఇప్పుడు మన ఆశయం సంపూర్ణ స్వాతంత్ర్యమేనని.

అధి :- అయితే బ్రిటీషు పార్లమెంటు సభ్యులు వచ్చారు గా బోలునే వారేమైనా ప్రతిఘటించారా.

రా. సా :- అబ్బే ఆ దేశీయోత్సాహంచూచి ఆశ్చర్యపడి మన కనుకూలంగా గంభీరోపన్యాసాలిచ్చారు, ఆ బెన్వ్సఫర్ వెడ్జివుడ్ గార్లు.

అధి :- అయితే లేబర్ పార్టీవారు మనకనుకూలమన్నమాటే.

రా. సా :- అదీ ఒక యెత్తేలేవయ్యా కొందరటూ కొందరిటూ

( తెరలో 'అంతా గాంధి మయం' పాట )

అధి :- చూడూ, చూడూ, ఆమహాకోలాహలంచూడూ, - ఓహో, పెద్ద స్వరాజ్య రథం బయలు దేరిందయ్యా, - సారధి గాంధి మహాత్ముడే - రధికులు నాయకులంతా ఉన్నారు. వీరజవహారే యువకులందరికి నాయకుడై రధము సాగిస్తున్నాడు. అంతా గాంధిమయమే.

( ప్రవేశం దే. సేలు. శాం. రాం. )

— పాట —

శాం :.

అంతా గాంధి మయం - యీ, జగమంతా గాంధి మయం॥

1. శాంతి చక్రమున సత్యమునడుపుచు
సత్యాగ్రహమును సాధన జేయుచు
సుంతయు వెరువక పంతము విడువక
గంతులు వేసెడు గాంధి మహాత్మ్యము ॥అంతా॥

2. ప్రభు శాసనముల నిరాకరించుచు
అభయ హస్తమున అందరిబిలుచుచు
స్వరాజ్య మిదుగో స్వతంత్ర మిదుగో
రారండనుచును దండిగ బిలిచే
దంతా గాంధిమయం॥ ఈ జగమంతా గాంధిమయం॥

రావు :- అదుగో చూడవయ్యా, ఆ జాతీయ కోలాహలం ఆపటానికి ఎవరి తరం. ఇక మనం యిక్కడ వుంటే మర్యాద దక్కదు కాలికి బుద్ధిచెప్పాలిసిందేరా - రా, రా

( పోబోవుచుండ )

శాం :- ఆగుడు, ఆగుడు, అయ్యా, మీరు భారతీయులుగారా, ఇంకనూ శంకించుచున్నారా.

ఉ॥ రండికళంకలేటికి, స్వారాజ్య రథంబు మహాత్ముడెక్కి భూ
మండలికిఁ శిరోమణిగ మాతృధరాస్థలి నిల్పుదీక్షరా
రండని పిల్చుచుండె సుకరంబగు శాంతి పథంబు బట్టి రా
కుండ నిరాకరింప వలదో భరతాత్మజులార లెండికన్

రావు :— వస్తున్నాం నాయనా వస్తున్నాం - మేము తొందర గానే మేల్కొంటున్నాం (అధికారితో మెల్లగా) మిత్రమా, మనకర్మ మేంగాలిందోయ్ ఈ దొడ్డిదోవలెందుకు, ఆ మహారథాన్ని వెనుక నించైనా నెట్టుదాం రా.

మీ :- అరస్టంచేనో

రావు :- అప్పుడు వెనుక వాళ్లం వెనుకనుంచే... ఊ... రా...

ఇద్దరూ :— మిత్రులారా, మేమూవస్తున్నాం పదండి.

దే. సేలు :- జై మహాత్మాగాంధీకి జై

( నిష్క్రమింతురు )

తెర లేచును - స్వరాజ్యరథం

(రంగం - మధ్యభారత్ నాగపుర ప్రాంతము )

( ప్రవేశం జవహర్ లాల్ - వేషం- తెల్లనిలాగు, పొడుగుఅంగ్రా, వెస్టుకోటు, నెత్తిపై ఖద్దరు టోపీ, చేతిలో పెద్ద త్రివర్ణపతాకము )

జన :— రండు, రండు భారతీయ యువకులారా రండు మన మహానాయకులిదేస్వారాజ్య మహారథ సంరంభమును సాగించు చున్నారు.

(ప్రవేశము దేశసేవకులు, శాం, వీర,) (చేతిలో త్రివర్ణ పతాకములు ధరింతురు)

శాం :- తయ్యార్, యువకాగ్రేసరా, మీతో పాటు అగ్ని గుండమున దూకుటకైనను మేమెల్లరము సిద్ధముగానున్నాము.

వీర :- తయ్యార్ జవహర్జీ, తయ్యార్.

కాం :- సిద్ధము, సిద్ధము - మీతో పాటు దేనికైననూ సిద్ధమే. భగవత్ సింగ్ నాటి మీ మహా ప్రతిభ మేమెన్నటికి మరువజాలము.

జవ :- అచ్ఛా, బహుత్ అచ్ఛా-ఈస్వరాజ్యరథమును అగకఅవిచ్ఛిన్నముగ సాగించుభారము మనపైననే యున్నదిసుమా! ఉరో - జెండా ఉరో.

( తెరలో చాటింపు) "స్వరాజ్య మీటింగులు, ఉత్సవాలు ఊరేగింపులు చేసేవాళ్లు, గాంధి టోపీలు పెట్టుకునేవాళ్లు అరెస్టుచేయబడుదురనిఇందుమూలముగాయావన్మందికి తెలియచేయటమైందోహో!

జవ.- భాయియో ఇదియే మనకు మహావకాశము మనముగూడ ఎదురుచాటింపు మోగ్రించవలెను.

కాం:- ఓ నేనునూ చక్కగా చాటింపుచేయగలను, మిత్రమా.

జవ:- శహబాష్, చాటింపుము ఇట్లు చాటింపుము. "అందరూ ఖాదీ గాంధీటోపీలు ధరించి ప్రభుత్వంవారిచ్చే అన్ని ఉత్తర్వులను శాంతంగా ఉల్లంఘించి జైళ్లన్నీ నింపివేయాలని మహాత్మాగాంధీగారి ఉత్తర్వయిందోహో — బోలో —

కాం:- "అందరూ......గాంధీగారి ఉత్తర్వయిందోహో" —

జవ:- అచ్ఛా అదుగో ప్రభుత్వంవారి చాటింపు ఇటే వచ్చుచున్నది. మరియొకవైపునుండి నీవు చాటింపుము. మేమిదే పోయి స్వరాజ్య రథమున పతాకము నెగురింతుము — జై భారత్ మాతాకీ,

అందరూ:— మహాత్మాగాంధీకి, జై.

(ప్రవేశం హరిజన్ డప్పు వాయించుచుతూ జవ. దే. సే. లు నిష్క్రమింతురు.)

హరి:- "ఇందుమూలంగా సర్వమైనవార్కీ తెలియచేయటం ఏమంటే ఖద్దర్ గాంధీటోపీ లెవ్వరూ పెట్టకోగూడదు. స్వరాజ్య

మీటింగులకు ఊరేగింపులకూ ఎవరూ పోగూడదు. ప్రభుత్వంవారి ఉత్తర్వయిందో హో—

(రెండవ వైపునుంచి ప్రవేశం కాంతారావు- ఖద్దరు గాంధీ టోపీ, ఖద్దరు చిన్న చొక్కా- పంచతో డప్పు వాయించుకుంటూ)

కాం:- యావన్మంది భారతీయులు ఖద్దరు గాంధీటోపీలు ధరించి ప్రభుత్వం వారిచ్చే అన్ని ఉత్తర్వులు శాంతంగా ఉల్లఘించి జైళ్ళని నింపివేయాల్నని మహాత్మాగాంధీగారి ఆజ్ఞయిందో హో !

హరి:- సభలు జరపగూడదూ, ఊరేగింపుల్లో చేరగూడదూ, అంతా వినండో హో (డప్పు వాయించును).

కాం :- సోదరా. నీగోలకాస్త ఆపరాదూ.

హరి:- మాదాగోలమీదా - అరుగో పోలీసోరొస్తుండారుండూ నీపని.

కాం :- పోలీసోళేంచేస్తారుగాని, ఇదుగోచూడూ, రాముడూ.

హరి :- అద్గో ఆ మాటే అనొద్దన్నది. మేము హరిజనులం. నా పేరు హరిజన్ తెలుసా!

కాం :- ఓహో! భేష్ మరీమంచిది. ఆ పేరు మీకెవరు పెట్టారు మిత్రమా.

హరి :- మీ గాంధిగారేగదంటయ్యా ఇంకా తెలీదూ.

కాం :- మాగాంధిగారేమిటి మన గాంధిఅందూ మీ హరిజనులకు గాంధిజీకన్నా ఆప్తులెవరున్నారు. ఏదీ ఒక్క-సారి గాంధీమహాత్మాకు జై అనూ.

హరి :- అంటాం, అనకేం. మాకాయనే మంచివాడు 'గాంధీ మహాత్మాకుజై'

(ప్రవేశం - అబ్దుల్ ఖాదర్, పోలీసుసార్జెంటు - లాటీకర్రతో)

ఖా :- ఏయ్ ఏమిటూ ఆలోచన్లు ? ఇదేనా నీ చాటింపు అదుగో గాంధి మూకలు మహా ప్రవాహంవలెవచ్చి పడుతున్నాయి. స్వరాజ్య రథోత్సవంటూ - చాటించు బాగా కేకెయ్.

హరి :- ఆ, ఆ. 'మరి యావన్మందీ ఈ స్వరాజ్య మీటింగుల్లోకి పోయి గాంధీ టోపీలు పెట్టుకొని.

ఖా :- అరే రాస్కెల్ ఏమిటదీ ?

హరి :- ఉండవయ్యా సాంతం అనొద్దు.

కాం :- మిగతాది నేనంటాలెండి. 'ప్రభుత్వంవారిచ్చే ఉత్తర్వులన్నీ శాంతంగా ధిక్కరించి జైళ్లకు పోవలసిందోహో'

ఖా :- ఏయ్ నువ్వెవరు. అరెస్టు చేస్తాన్ జాగ్రత్త. తియ్ ఆ గాంధీటోపీ తీసెయ్.

కాం :- ఆ, ఆరోజులు పోయినయ్ అందరం జైలుకు సిద్ధమే.

ఖా :- ఓ - బద్మాష్ (గాంధీటోపీలాక్కొని లాటీతో కొట్టి నెట్టి వేయును) జావ్

కాం :- (తిరిగి మరియొక టోపీతో ప్రవేశించి) అరెస్టుచేయవయ్యా ఎంతమందనిచేస్తావో చెయ్యి. అదుగోచూడు ఆ గాంధీటోపీల ప్రవాహం.

( 4 సార్లు టోపీలాక్కొనగా తిరిగి టోపీతో ప్రవేశం )

ఖా :- ( పారజూచి ) అబ్బో, అదేంజనం, అదేంజనం - అరే భేపాజం - ఆవ్ రే, ఆవ్

భే :- (పరుగెత్తుకొంటూవచ్చి) హాజర్, హాజర్ ఏమిటీ సంగతి.

ఖా :- అబ్బో, నువ్ గూడా గాంధీటోపీ పెట్టావే ఇదుగో లాటి తెలుసా.

భే:- ఇవ్—కామూవ్ (కన్నుగీటును)

కాం:- సార్జంటుగారూ, అది మాటా 'పీగాదు లెండి భయపడ కండి అదిదొంగ ఖద్దర్ టోపీ. సి. ఐ. డి. టో 'పీలెండి - ఏదీ బ్రదర్ - చూద్దాం.

భే:- (తనలో) అరే, మనగుట్టు బైటపడ్డదే- ఉండు సోదరా- అదుగో, ఆగోల విన్నా, తెరలో - గాంధీమహాత్మాకుజై. (బహ్మాండ మైన కేకలు-).

ఖా:- అరే, అరే, ఆ మహాజనం చూడూ బే - జల్దీజావ్ - ఇన్స్పెక్టర్ సాబ్ కు జల్దీ బులావ్- ఇంతామందీజనం మాకీయేంసేస్తాం- (భే - నిష్క్రమించును.)

కాం:- మహాత్మాగాంధీకి జై - భారతీయులు యావన్మంది ఈ స్వరాజ్యరథ మహోత్సవంలో పాల్గొనాల్సిందా హో - (డప్పు వాయించును).

ఖా:- అరే, బద్మాష్ తూ జావ్ - (గాంధిటోపీ - డప్పులా క్కొని లాఠీతో నెట్టివేసి హరిజన్ తో) నువ్వు అరూ భే - ఇన్ స్పె క్టర్ సాబ్ వస్తాడ్ - అట్లాపో, అటూపో.

హ:- ఓ, ఓ, (వాయిస్తుండా) యావన్మందికీ తెలియచేయుటం ఏమంటే గాంధిగారు - అ అ అ - కాదు ప్రభుత్వంవారు (నిష్క్రి మించును).

ఖా:- అబ్బా, ఈ బొడ్కో నౌకరీ సేసేది సాలా కష్టం - ఎంతా మందీ కొట్టాలి - ఏం సెయ్యాలి - చేతుల్ నెప్పి వేయస్తుండాయ్ ఊర్కే కొట్టాలంటే మాక మన్సూ - ఖరాబ్ ఖరాబ్ - మన్కీ- ఇన్ స్పెక్టర్ సాబ్కీ సెప్తాం.

(ప్రవేశం స్వరాజ్య రథం-మహోత్సవం ముందు జవహార్ దేశ సేవకులు జాతీయ జెండాలతో పాడుకుంటూ రథముపై గాంధి. (వేషం- టోపీగాంధి) పొట్టి ఖద్దరు పంచ, ఖద్దరు పొట్టిచొక్కా, ఖద్దరు గాంధి

టోపీ) దాస్, మాలవ్యా, సరోజినీదేవి-అలీసోదరులు మొ॥ నాయకులు అందరూ ఖద్దరు టోపీలు ధరించి-రథం వెనుక అధికారి, రావుసాహెబ్]

(జవహర్‌లాల్ చెప్పుచుండ దే. సే. లు అందరూ వంతపాడుచుందురు.)

— పాట —

జవ:- కదిలింది కదిలింది కాంగ్రెస్సురథమండీ
చేయెత్తి యొకసారి జోహారు సేయండీ॥

1. దేశసేవకు మీరు ధీరులై నడవండీ
దేశస్వాతంత్ర్యాన్ని తెస్తామనిసాగండీ
దాసోహమని గాంధీదారినే నడవండీ
వాసిగ భారతప్రతిభనే నిలుపండీ॥

2. ప్రభుసంస్థలన్నింటి పడగొట్టి సాగండీ
శుభమంటూ స్వారాజ్యసోపానా లెక్కండీ
శాంతాన్ని యేవేళ స్వాంతాల విడకండీ
సంతోషముగ అన్నిత్యజియించి సాగండీ॥
కదిలింది - కదిలింది॥

జవ:- బోలో భారత్ మాతాకీ -.

(త్రివర్ణ పతాకము రథముపై నెగిరించి.)

జెండా - ఊచో -

అందరూ (దే. సే. లు):- (మిలటరీ సెల్యూట్‌గా జెండాకు వందన మర్పించి.)

— పాట —

"ఖండాంతరముల ఖ్యాతిగాంచి జయంబుగూర్చెడి జెండా।
ప్రచండమైన భరతఖండం ప్రతిభనిల్పే జెండా॥

హిందువులయెడ యెర్రనై।
ఇస్లామునందున పచ్చనై
ఇతరమతములందు ధవళమై
ఐక మత్యం ఆడే జెండా॥
ఖండాంతరముల॥

జవ :- దేశ సేవకులారా, ఈ స్వరాజ్య మహారథమును లాగని వాడుపాపాత్ముడు. లాగండి అవిచ్ఛిన్నముగ, అహింసాయుతముగ ఆనందముగ అఖండ వేగమున లాగండి - రండి.

—♦ పా ట ♦—

[జవ, దే. సే. లు అందరూ]

1) రండు హైందవ శూరులార-కదిలి రారండోయ్॥
బాబూ, రథములాగండోయ్॥
స్వేచ్ఛ చచ్చి చిందులాడే-పిచ్చి మానండోయ్।
మీరూ, జైళ్లు నింపండోయ్ ॥రండు॥

2) వడుకు నూలూ వలువల్ నేసి
చేతివృత్తులు లేవ దీసి
కల్లుసారా కెల్లరోసి
జైళ్లలోని కెళ్లేవద్దాం ॥రండు॥

3) పాఠశాలలు పాడూ పెట్టి
కోర్టులన్నీ కూలదోసి
సీమగుడ్డలు చించివేసి
జైళ్లకెళ్లి జై జై అందాం ॥రండు॥

గాం :- ధీర్ హై, ధీర్ హై జవహార్ బహుత్ ఖుషీ హై-యువ కాంగ్రేసరులారా, మీ యుత్సాహమున కెంతయు సంతసించుచున్నాను మహాజన భాయియో।

గీ॥ కాంగ్రెసు రథంబి దేసాగ గాంచుడయ్య
రథమిక స్వరాజ్య సోపాన పథముబట్టి
ఆగకయె అవిచ్ఛిన్నమై అరుగ గలదు।
వెడలుడు స్వరాజ్య సౌధ ప్రవేశమునకు -
ఈ మహోద్యమ వీరులే యిపుడొ రేపొ
రాజ్యసౌధంబు నెక్కి విరాజిలెదరు॥

కాని

మ॥ మరువక్ బోకు డహింస యేమనకుస-న్మార్గంబటంచున్ నిరం
తర దావ్యానల మార్పగోరు నెడ శాం-తంబన్నచన్నీరు స
త్వర మేజల్లుడి, అగ్ని కాజ్యమటులన్ దౌర్జన్యమన్యాయముల్
పెరుగన్ జేసి యనర్థకంబవనిలోఁ బెంపొంది పీడించెడిన్

దాస్ :- "తతిగాంధీయుగ మేగుదెంచెమసిక యేతత్ భారతీయ స్వరా
జ్యరథంబాతని సారథిత్వమున వే - సాగించుడంచున్ జగ
ద్గురు డేగెన్ దివిలోక మాన్యుడవె యుద్ఘోషించుతూర్యధ్వనుల్
ఉగ్రతద్దివ్య రథంబు లాగుటకు రండో భారతీయ ప్రజల్"॥
(బ. ల. కవి.)

మహమ్మద్:- హిందూ ముసల్మాన్ భాయిభాయి, బోలో, భారత్ మాతాకీ, మహాత్మా గాంధీకి — భాయిభాయి, ఇది మన దేశము - కావలసినది మనస్వరాజ్యము. ఆసించునది మనస్వేచ్ఛ - మనప్రభుత్వం వారిపై ఈనాడు ఏ భారతీయునికి ఎట్టి విశ్వాసమూలేదు. ఇంకనూ ఆలసించుటేటికి - ఆ అమానుషమైన పంజాబు హత్యలకు ఉపశాంతి జరుగలేదు మా ఖిలాఫత్‌నకు అన్యాయము ఆగలేదు. ఈ నాడిచ్చట ప్రభుత్వమే లేదు. లాఠీకర్రలే పరిపాలించుచున్నవి. సైతాన్ చిందులు త్రొక్కుచున్నాడు. లెండు, ఈ స్వరాజ్య రథోత్సవములో పాల్గొనుడు. మహాత్మునకు తోడ్పడుడు. విజయము సాధించుడు - జై మహాత్మా.

మాల:- మహాజనులారా ! ప్రభుత్వము వారిపై మన యాశలన్నియు అడుగంటినవి. ఇతర ప్రయత్నములు విఫలమైనవి. సుఖాశయములు విఘాతమైనవి - ఎట్లందురా !

సీ॥ మంచితనాన సాధించుదమనకొన్న
మనమాట చెవియొగ్గి వినరువారు
ఆంగ్ల ప్రజాసాయ మాసింతమన్నచో
వారికే గతిలేక వగచుచుండ్రి
రణరంగమున రాజ్య మణగ ద్రొక్కు-
దమన్న ఆయుధంబుల జ్ఞాన మసలులేదు
విన్నపంబులవారి వేడుకొందమటన్న
ఆ యాశలప్పుడే అంతరించె

గీ॥ 'మీ సహాయంబు వలయును, తొలసివేయు
మింక మీ దేశసంబంధమెన్నటికిని'
అనుట నికమాని మనస్వశక్తిని వెలార్చు
తరుణమిదెవచ్చె, రండు, హైందవులు వేగ॥

షౌక :- అఖండ భారత్ కా భాయియో, ఇంకనూ వెనుదీయుచున్నారా మీరు భారతీయులుకారా, మీ నాళములలో భారతీయ రక్తము ప్రవహించుట లేదా! మన భారతీయుల ఆర్తనాదములు మీకు వినిపించుటలేదా! మన దేశ దుస్థితి మీకు కనిపించదా! హిందూ ముసల్మాన్ భాయియో, మన మందరమును ఒక్క మాతృభూమి గర్భమున నే పుట్టితిమని ఎన్నటికినీ మరువకుడు. రెండు, రెండు, మన మందరము భారతీయులమే. ఈ పర రాజ్యదాస్యమునింక భరించము, సహించము సాగనీయము. ఇదియే మనకు మహావకాశము - ప్రభుత్వమునకెట్టి సహాయమును నిరాకరింపుడు-లాటీదెబ్బల భరించుడు-జైళ్లు నింపుడు-ప్రభుత్వమును పారద్రోలుడు, స్వరాజ్యమును జూరగొనుడు-జై మహాత్మా.

(ప్రవేశం పోలీస్ ఆఫీసర్ అబ్దుల్ ఖాదర్ (సార్జెంటు) తుపాకులతో)

పో.ఆ :- ఈ స్వరాజ్య రథోత్సవమున పాల్గొనుచున్న జనులందరిని అరెస్టు చేయుచున్నాము నడవండి జైలుకు.

( అధి. రా. సా. వెనుకవారు వెనుకనే జారుకుందురు )

మహా :- ఆనందము, మహదానందము. సిద్ధముగానున్నాము.

పో.ఆ :- మహాత్మా మిమ్మంటుటకు మాకుహుకుము లేదు. మీరు మహానాయకులు.

మహా:- నేనుగదా ఈస్వరాజ్య రథోత్సవము సాగించుచున్నది.

మాల :- | దాసు వ॥:- } మేమునూ సిద్ధముగానున్నాము.

పో.ఆ :- మన్నించండి మహానుభావులారా, జనులారా, నడవండి.

అబ్దుల్ :- ఊఁ, జల్దీ - పదండి.

జనులు :- తయ్యార్, తయ్యార్ - మహాత్మాగాంధీకి జై.

(శాం, వీర, శాం, మో॥ దే. సే. లు. అందరు నిష్క్రమింతురు)

గాం :- మహాజనులారా! శాంతముగ మాత్రము ప్రవర్తించుడు. మేమునూ మీ వెంటనే వచ్చుచున్నాము.

మాల :- రథము సాగించుదము. అరుగో ప్రజలు తండోప తండములుగ ముందుకువచ్చి అరెస్టగుచున్నారు.

జవ :- జంకూ గొంకూ లేక లాటీ దెబ్బలు గూడ భరించుచున్నారు.

దాస్ :- పట్టుకున్నవారిని దూరముగ గొంపోయి వదులుచున్నారు. జైళ్లు చాలుటలేదు.

మహా :- మనకునూ శుభ లేఖలు శీఘ్రముగ నే వచ్చును సాగండి. (నాయకులు సాగిపోవుచుండ ప్రవేశము సరోజినీ దేవి.)

సరో :- ఓ ప్రభుత్వ పాలకులారా, పురుషులందరిని నిర్బంధించు చున్నారుగదా, భారత దేశమున స్త్రీలు లేరనుకొనుచున్నారా. ఇదే వచ్చుచున్నాము, కాచుకొనుడు. ఓ భారతవీరనారీమణులారా, మనకి దే తరుణము. లెండు, రండు, ఈ స్వరాజ్య రథోత్సవములో పాల్గొనండీ- జైళ్లనునింపండి.

సీ॥ తలిదండ్రులార, మీ తనయులను ప్రభుత్వ
బడులకంపుట మానవలయునిపుడె
విద్యార్థులార మీ విద్యాలయముల
తక్షణమే విసర్జింప సాగరయ్య
అధికారులార, మీ యాధీనమందున్న
బడులమాలిన్యంబు బాపరయ్య
న్యాయవాదులు మీర లన్యాయవృత్తి
చాలింపయత్నముల హెచ్చింపరయ్య।
వర్తకులార, ఏ పర దేశవస్తువుల్
గొనక నార్థిక వృద్ధిగోరు డయ్య

గీ॥ స్త్రీ పురుషులెల్ల త్యాగసంసిద్ధులగుడు
గ్రామ సంఘంబులెందు నేర్పరచుడయ్య
సేవకాసంఘముల నెన్నొ జేర్చరయ్య
కోటిధనమిచ్చి మన గాంధి గొలువరయ్య॥

మఱియు, ఓ మహాజనులారా, ఇదియే అఖిల భారత కాంగ్రెసు మహాసభ మీకిడుసందేశము.

మ॥ జనులెల్లన్ వలదంచు ఘోషిలగ లక్ష్యంబెంతయున్ లేక నె
మ్మనమందాశలగొన్ని పెట్టుకొని స-న్మార్గంబునన్ రాక కా

సనసభ్యత్వమునందబోయిన-ఘనుల్ స్వాంతంబులన్ ద్రిప్పి త
త్క్షణ మేరండు స్వరాజ్యపున్ రధములాగ నె మాకుజేదోడుగా

గీ॥ ధర్మమే రధము మనయుద్యమమునందు
ధర్మ మూర్తియే సారధిధరణి మనకు
దేశసేవకెల్ల త్యజించి ధీరుడగుచు
సిద్ధపడు వాడె పార్థుడీ యుద్ధమందు
శాంత మే దివ్యశస్త్రాస్త్ర సాధనములు॥

మహాత్మా తమ ఆజ్ఞానుబద్ధులము. అదుగో చూడుము వేనకు, వేలు వీరనారీమణులు గూడ ఘోరమైన లాటీదెబ్బలకు గురియగుచును జైళ్లనింపుచున్నారు. తమ ఆశీర్వాదమునకెదురు చూచుచున్నాము.

గాం :- సరోజినీదేవీ, మీ పరాక్రమ మద్వితీయము. విజయోస్తు, విజయోస్తు.

సరో :- అనంతర కర్తవ్యము మహాత్మా!

గాం :- అనంతర కర్తవ్యము ఉప్పుసత్యాగ్రహమునకు నేనే దండియాత్రకరిగి స్వయముగా ఉప్పుచేసి ఆ సత్యాగ్రహ మారంభించెదను. మీరిప్పుడు కాంగ్రెస్ అధ్యక్షులుగదా. ఇతర వ్యవహారము లన్నియు మీరే నిర్వహించుచుండవలెను.

జవ :- మహాత్మా, మీతో పాటు, మేమును దండియాత్రకు సిద్ధముగా నున్నాము.

గాం :- వలదు, వలదు. నేనిప్పుడొక కాలు దండిలోను మరియొక కాలు జైలులోను పెట్టి నడుచుచున్నాను. మాఅనంతర కార్య నిర్వహణ భారము వహించుటకు నీపైననే ఆశపెట్టుకొనియున్నాను. మీరిచ్చటనేయుండి కాంగ్రెస్ కార్యక్రమమును శాంతియుతముగ సాగించుచుండుడు.

మా :- ఉప్పుసత్యాగ్రహ విజయమునకు నేనును శ్రీ ఇర్విన్ వైస్రాయిగారితో సంప్రదింపులు జరుపుచుండెద.

గాం :- పండిట్జీ, శాంతిసమరమున సమాధానము ఎల్లప్పుడు వాంఛనీయమే. తమ ఇచ్ఛవచ్చినట్లు వ్యవహరించుడు. నాకిక దండీ యాత్రకు సెలవొసంగుడు.

సరో :- మహాత్మా, మీదండీయాత్ర దిగ్విజయముగ సాగుటకు ఇదిగో కళ్యాణకుంకుమ. (మహాత్మునికి కళ్యాణకుంకుమ నలంకరించును.)

అందరూ :- జై దండీయాత్రకు. జై మహాత్మాగాంధికి.

మహా : ఈ దుస్తుల భారముగూడ నాకేటికి (టోపీ, చొక్కా తీసివేసి, అంగవస్త్రము పైకిదోపి పెద్ద వెదురుకర్ర జెండా చేతబూని బొడ్లో తెల్లని జేబుగడియారము గొలుసు తగిలించుకొని సాగిపోవు చుండ) —

సరో :- (అందరూ) పాట :

జై మహాత్మా, జై స్వదేశా, స్వతంత్రదేశా జై॥
గాంధి విధంబే బంధహారంబు జయజయ భారత్ దేశ్॥

మేటీజెండా - మింటికినిండా,
ధీరస్వరాజ్యం - దిక్కులునిండా,
నశింపజేయుడు - పిశాచిదాస్యము,
స్వేచ్ఛగభూమిని సుఖియింపంగా
తుచ్ఛవిదేశస్మృతులు దొలంగా॥
జై మహాత్మా - జై స్వదేశా॥

అందరూ :- మహాత్మాగాంధికి జై. దండీయాత్రకు జై. (నిష్క్రమింతురు.)

జవ :- (వెనుకకు తగ్గి) ఆహా! ఏమి యీ మహాత్ముని అద్భుత ప్రభావము.

మ॥ భయమున్ జెందడు, భారమంచనడు,
నిర్బంధప్రవాసాంతకే
నియు భీతిల్లుడు, భీకరాకృతి శత
ఘ్ని శ్రేణిడీకొన్న దు
ర్జయుడై నిల్చి చలత్వమొందదురణో
త్సాహంబునన్ గాంధి జై
జయనాదంబుల దండికిన్ వెడలె,
సాక్షాత్ విష్ణుమూర్తి ప్రభన్॥

( నిష్క్రమించును. )
( తెరపడును. )



( తృతీయాంకము )

# 6వ రంగము

## ఆంధ్ర దేశం - కృష్ణాతీరం

వీధి-ప్రవేశం - ఆంధ్రరత్న - రామదండుతో (దే. సేవకులు రామభటులుగా పంగనామములు కాషాయితలగుడ్డలు లాటీలు ధరింతురు. ఆంధ్రరత్న వేషం కాషాయి తలగుడ్డ పంగనామములు మెళ్లో పెద్దరుద్రాక్షలు-చేతలో చిరుతలు.)

ఆంధ్ర (రామదండు) జై శ్రీమద్రమారణగోవిందోహరి-

(జంగంకథ)

రామా, రామా కలియుగరామా గాంధీ వరనామా॥
రామ రామ శ్రీ కలియుగ ధామా గాంధిపరంధామా॥

వంత॥ - దండాలు తండ్రి = (తంధానతానె)

1. సీమవారు మా జుట్టు పట్టుకొని క్షేమము చెరిచెరిగా
పామర జనముల బాధలుగని మా భయము దీర్చినావు
బంగరుపండే భారత భూమియె పరుల పాలయిందీ
లంగరువేసి కూర్చున్నాడు ఇంగ్లీష్ ప్రభువండీ॥
అన్ని హంగులూ అమరియున్ననూ - అల్లుని శనియండీ
సన్న సన్నగా కాజేశాడు - కాజేస్తున్నాడు-బల్
టక్కరోడుగా ఇంగ్లీషోడు సక్కజిత్తులండీ
ఎక్కడలేని దరిద్రమిచట - రొక్కం ప్రభుదండీ
సీమతన్నులూ భూమిపన్నులూ ఏమరనీయవుగా
నామ మాత్రమై భారత మాతా - నగు బాట్లయ్యెనుగా॥
రామా, రామా॥

వంత॥ ఓహెూ, ఎవరయ్యామీరుచాలాఘోరుగామాట్లాడుతున్నారు

2. ఆహాహాహా! ఆంధ్రులమండీ - ఆర్యజాతివారాది
దక్షిణ భారత మకుటసీమ మా మహిత రాంధ్రమండీ

కృష్ణా, కావేర్, గోదావరులే కూడలిమాకండీ
అక్షయముగ మా మూడుకోట్ల జనులాంధ్రవీరులండీ॥తం॥

3. కొండాజీమానాయకుడండీ కొదువ యేమిమాకూ
పట్టాభియెమా ప్రతిభాశాలి గట్టిబుర్రమాది
కాశీనాధుడె "విశ్వదాత" మా వాసి కూర్చునండీ
టంగుటూరి మా సింగంబండీ హంగులన్ని మావె

వహ్వా,

దుగ్గిరాల శ్రీ కృష్ణుడు వీడే అగ్గిరాముడండీ
అసహాయోద్యమ వీరుతె అంతా ఆంధ్రభూమినిండా
ఖాదీ అంటే మా పల్నాడే ఖ్యాతి గాంచెనండీ
పల్లెటూళ్లలో గాంధీ ప్రభలే బయలుదేరెనండీ।
అసహాయోద్యమ మున ముందంజే ఆంధ్రభూమిదండీ
మిసమిసలాడుచు రైతులందరూ మొలపెట్టిరి మీసం॥రామ॥

వం॥ అయితే ఆంధ్రులంటే ఎవరో ఎవరికీ తెలియదేమయ్యామరి, ఉత్తర హిందూస్థానంలో అందరూ మన్నిమద్రాసీమద్రాసీ అంటారే, ఏదీ మీ ఆంధ్రాన్ని గురించి కాస్త వివరంగా చెప్పు వింటాం- వినండి, వినండి.

సీ॥ చిల్కాసరము ముద్దు లొల్కు శిరంబున
వ్రేలాడు సొగసుల వేణిగాగ।
గౌతమీ కృష్ణలు కనక భాసిత మేలి
జోడంచు చేలంపు సొగసులీన
కొండవీడ్ బొబ్బిలి కోటలు వక్షాన
కుచకుంభముల స్ఫురించుచును వెలయ
శ్రీ శైల తిర్పతి - సింహాభద్రాద్రులే
నేత్రద్వయంబు వర్ణించుచుండ

గీ॥ రాయల విశాలసీమ, ఓర్గల్లుభూమి
దీర్ఘ బాహువులై మహోత్తేజమలర,
భరతమాత గట్టిన పైడి చెఱగుబట్టి
ఆడుకొను ముద్దులేమ శ్రీ ఆంధ్రభూమి॥
శ్రీ మద్రమారమణ గోవిందోహరి॥

వంత॥ భేష్ బాగానే వుంది. అయితే ఈ అంద చందాలూ హంగామాయేగాని పూర్వ చరిత్ర మీకేమీ లేదన్నమాటేనా- భళీ, భళీ

4. ఆంధ్రుల చరితమె అద్భుతమండీ ఆలకించరండీ
ఋగ్వేదములో ఆంధ్రుల ఘనతను ఋక్కులు పొగడెనుగా
ఇటు రామేశ్వర మటు పాటలిపుర మధ్య యేలిరాంధ్రుల్
నాగార్జున శక మమరావతిలో నాట్యమాడెనండి
అల యశోకుని విలసత్ కాంతులు అంధ్ర భూమి వెలిసె,
విజయనగర సామ్రాజ్యం బేలిన రాయలాంధ్రుడండీ,
కొండవీటి యుద్ధం డప్రతిభ మా రెడ్డి ప్రభులదండీ।
ఓర్గల్లేలిన యుజ్వల తేజమె ఆంధ్రుల ప్రతిభండీ
బొబ్బిలి శూరులు రుద్రమదేవీ తెలుగు ధీరులండీ
పాడిపంటలకు లోటులేని మా మహిత రాంధ్రమండి
నాడూ నేడూ ఉజ్వల తేజం ఆంధ్రభూమి దండీ

వంత॥ ఓహో-అయితే ఆంధ్రుల చరిత్ర అత్యద్భుతమైనదన్న మాటే భళాభళీ

5. వినరా, ఆంధ్ర విశాల విహారా విజయము మనదేరా
అసహాయోద్యమ వీరులు మీరే పసజూపించండీ
రైతులందరూ పన్ను లివ్వమని ప్రతిజ్ఞ సేయండీ
పట్నవాసులూ పన్నుల నన్నిటి నున్నా చుట్టండీ

చీరాల పేరాల సీమ వీరులే ప్రతిజ్ఞ చేశారూ
పెదనంది పాడున వీరరైతులే పేరు నిల్పిరండీ
గుంటూర్ గొప్ప ఆంధ్రభూమిలో కొత్తదిగాదండీ
గాంధి మహాత్ముని కడపటి ఘట్టం పన్నుల దేనండీ
బార్డోలీలో గాంధి మహాత్ముడు పన్నుల పసపట్టె
ప్రతిభాశాలురు గుంటూర్ రైతులు భయపడి పోతారా
చిల్లిగవ్వయే చెల్లదనండీ చిత్రం చూడండీ
'ముల్లేమూటా' కడతాడండీ తెల్లప్రభువుగారూ
కొట్టావద్దా తిట్టావద్దూ గట్టి పట్టుపట్టి
కట్టు బాట్లతో కదలాలండీ రైతుదిట్టలారా
అట్టికైటు మన ఆంగ్ల ప్రభువుల ఆటే కడుతుందీ
రామదండీ దేసాగిందండీ రండీ ప్రజలంతా
రామ రామ శ్రీ కలియుగ ధామా గాంధిపరంధామా॥
శ్రీమద్రమారమణగోవిందోహరి ॥

ఓ ఆంధ్రరైతుల్లార, రండి, మేల్కొనండి - మా రామదండులో చేరండి పన్నులు సున్నా చుట్టండి.

అందరూ :- — పాట —

తెలుగుధీరులు మీరు తెలుగు దేశము మీది
తెలుగుధీరుల శక్తి దెలుపండీ
తెలుగుజెండా యెగురవేయండీ॥
తెలివి తేటల్లోను తెలుగువారంటేను
దిశలు మార్మ్రోగింది తెలియండీ- తెలుగువారల కీర్తి నిలుపండీ॥

(ప్రవేశం - అబ్దుల్ ఖాదర్, పోలీస్ సార్జెంట్)

అ.ఖా :- అయ్యా, ఆంధ్రరత్నగారూ, దయచేయండి, మీ రామదండుతోసహా దయచేయమన్నారు.

ఆం.ర :- ఓహో ! ప్రభుత్వంవారి శుభలేఖేనా - శుభం.

అందరూ :- జై మహాత్మాగాంధీకి - ఆంధ్ర రత్నగోపాల కృష్ణయ్యగారికీ -

ఆం ర:- ఆంధ్ర మహాజనులారా, రైతుసోదరులారా, మేమంతా ప్రభుత్వంవారి విందుకు వేంచేస్తున్నాం. మీరూ సర్కారు పన్నులు సున్నాచుట్టి త్వరగా మాలో కలవండీ. జైళ్లుఖాళీగావుంచుతాం. త్వరగా దయచేయండి వెనుదీయకండీ. పిల్లా, మేకా ఆలూ మగలూ అంతారండి. శాంతం. పన్నులు - మరువవద్దూ పోతున్నాం - శ్రీమద్రమారమణగోవిందోహరి. పెదనందిపాడులో సర్కారు పన్ను లన్నీ గోవిందా - గో... విందు.

అందరూ :- శ్రీమద్రమారమణ గోవిందోహరి - ( నిష్క్ర )



( తృతీయాంకము )

— తెర లేచును —

## 7 వ రంగము

దండీ - (ఉప్పుసత్యాగ్రహము)

[ ప్రవేశము పల్లెకారుల వేషమున సముద్రతీర వాసులు ]

( వీరలాల్, ధీరసింగ్, కాంతారావు వేషముల మార్పుతో రావచ్చును. )

1 వ. పల్లెకారు (వీరలాల్) పాడుచుండ అందరూ.

— పాట —

భారతీయుల కింతభయమేలా॥

1. దేశ దేశాలోండ్లు ధీరలై పోతుంటె గనలేరా
భారతీయులకింతభయమేలా॥
స్వాతంత్ర్య రాజ్యాలు చక్కనీ సౌఖ్యాలు జనులారా।
పర తంత్రజనులమై బ్రతుకేలా ॥భారతీయుల||

2. దేశసౌభాగ్యాన్ని దోచుకెళ్తున్నాడు గనలేరా।
వాసిగా మన దేశ ప్రతిభ జూపించాలి, జనులారా॥
పరతంత్ర జనులమై బ్రతుకేలా
భారతీయులకింత భయమేలా॥

2 వ. పల్లె - అరే, సేదాం రండశా - ఇంకా భయ మేందిరా, గాంధి దేవుడు సెప్పాడుగా

3వ. ప-పిల్లామేకా, ఆడోంళ్లు ముసిలోండ్లు, అంతావస్తుండారా)

1 వ. ప - ఆగండోసి, ఆగండి ఆ తొందరేవొద్దన్నాడు,మన మహాత్ములవారు - ఆయనముందు జేసిందాకమననొద్దనలేదటా)
అదుగో, దేవుడొచ్చాడు - డొచ్చాడుసిద్దంగా - వుండండిరా

ప్రి - గాంధి (దండియాత్ర వేషంతో)

అందరూ :- దండాలు, దండాలు గాంధీ బాబయ్యా సాష్టాంగ దండాలు.

గాం :- సోదరులారా, మీరందరూ ఎన్ని కష్టాలొచ్చినా శాంతంమాట మరిచిపోకూడదుసుమా.

అం :- మా గొంతులు కోసినా మీ ఆజ్ఞ తప్పం మా ప్రిభో అన్నిటికీ సిద్ధమే.

గాం :- ఇదుగో నేనే ముందు ఉప్పు చేస్తున్నాను. (సముద్రం నీళ్లు ఉప్పు మడిలోకి చిందించి) ఇక మీరంతా శాంతంగా ఉప్పు చెయ్యండి.

అందరు:- (వీర, చెప్పుచుండ పాట పాడుకుంటూ ఉప్పు చేయుదురు)

— పా ట —

" పోగు చెయ్ - పోగు చెయ్ "

1. ఉప్పు చేస్కుంటేను ముప్పులొస్తాయంట
   ఉప్పైన లేకుండ ఉంటామా
   ఉప్పూ చేస్కుంటేను చస్తామా ॥పోగు చెయ్॥

2. ఉప్పు చేస్కుందాము ఉరిశిక్ష లేసినా।
   ఉప్పూ చేయుట మానుకుంటామా||
   ఉప్పెనాగాలొచ్చి ఊడ్చి కెళ్తుంటేను
   ఉప్పులో నే పట్టుకుంటాదా॥
   ఉప్పైన లేకుండ ఉంటామా॥
   పోగు చెయ్, పోగు చెయ్॥

3. ఉప్పుకల్లూ వేసి ఉడుకుడుకుగంజీతో।దప్పికార్తుందం టేత ప్పేమీ,
   ముప్పులెన్నొచ్చినా పోతామా-ఉప్పుతడికి తాత సామ్మేనా॥
   పోగు చెయ్, పోగు చెయ్॥

( ప్రె - ఖాదర్ ఖో - సార్జెంటు )

ఖా:- ఏయ్-మిమ్మందరిని అరెస్టుచేస్తున్నాను నడవండిజైలుకు.

అంద :- జై మహాత్మగాంధీకి-ఉప్పు సత్యాగ్రహానికి, అరే రండిరా, సిద్ధం, సిద్ధం.

3 వ. ప - అయితే మహాత్ముణ్ణిగూడ పట్కెళ్ళావంటయ్యా, మరి

ఖా :- లేదు మీ మహాత్ముడి జోలికి రావటానికి మాకు హుకుంలేదు.

2 వ. ప - మా మహాత్ముడేందయ్యా, మన మహాత్ముడనలేవూ నోరునెప్పా.

గాం :- అ, ఆ, ఆ మాటగూడా దౌర్జన్యమే, దేశీయులారా, ఎవరినీ ఏవిధముగాను నిర్బంధ పెట్టగూడదు.

ఖా :- (తనలో) ఆహా! మహాత్ముని శాంతం నిజంగాఅద్భుతమే.

గాం :- సార్జంటుగారూ, దేశీయులందరిచేతను ఉప్పు చేయించుచున్నది నేనుగదా, నేను చేయని నేరము వారేమిచేసిరి. ముందుగా ఉప్పు చేసినదినేనే.

ఖా :- మహాత్మా ! తమకు తెలియని విషయములేమున్నవి. క్షమించాలి. ఆ, ఇక మీరందరూ నడవండి.

అందరూ :- సిద్ధం, సిద్ధం.

1వ. ప్లె - ఒరే అబ్బాయ్, ఒసే అమ్మాయ్. మీరుగూడా రండిరా. దబ్బు దబ్బున సాగండి.

2వ. ప - అరేయ్, మన ముసలిదానినిగూడా తీసుకురండిరా.

3వ. ప - ఊళ్లో ఒక్క పురుగైనా లేకుండా అంతారండిరా.

రండి, రండి (సాగిపోవుచూ) (తెరలో-వస్తున్నాం, వస్తున్నాం కేకలు)

గాం :- సోదరులారా, శాంతం, శాంతం. మేమూపన్యాసపదండి.

అందరూ :- సెలవిప్పించండి, మహాప్రభో.

గాం :- పోయిరండి. శాంతం మరువకండి.

అంద :- 'జై మహాత్మాగాంధికి జై ఉప్పుసత్యాగ్రహానికి...

( ఖా, ప. కాల్లు నిష్క్రమింతురు )

గాం :- ఆహా! భారతీయుల ధైర్యోత్సాహములు ప్రశంసార్హములుగదా. ఈ బానిసత్వబంధ విచ్ఛేదనకు ఈ అసహాయోద్యమమే సుసాధనమని నా మనస్సున కెంతయు ధృవపడినది. తండోప తండములుగ దేశీయులు జైళ్లకురుకుచున్నారు. ఇప్పటికైననూ, నా ఆఖరు లేఖలోని సదుపదేశములు (శ్రీ)వైస్రాయిగారి మనస్సు మార్చునేమో! చూచెదగాక! ముమ్మాటికి నా శాంత విధానమే దేశవిముక్తికి సత్సాధనము!

సీ॥ బంధముల్ వారెంత బలముగ బిగియింతు
రల్కగా మన బంధమపుడె తెగును
దౌర్జన్యమెంతగా దుర్జనుల్ సేతురో
ధర్మంబు నాల్గుపాదముల నడచు
పశుబలంబెంతగా పసిబట్టి సాగునో
ఆత్మబలం బంత యద్భుతమగు।
అన్యాయ మెంతగా నాధిక్యమైసాగు
నంతగా న్యాయమే యలరుతుదిని

గీ॥ ఆత్మ బలమున పరమేశ్వరాంశ వెలయు
పశుబలంబున రాక్షస ప్రకృతిదనరు
నంది యంబేల శాంత సుస్వాంత మొకటె
లోక కళ్యాణమునకు సుశ్రీకరంబు॥

( ప్రవేశం - శాంతా రాం (దే.సే) ఒక జాబుతో )

శాం :- మహాత్మా, ప్రణామములు. ఇదుగో, మాలవ్యాపండితు డీలేఖను తమకంపియున్నాడు వైస్రాయి ఇర్విన్ ప్రభువుగారు తమ లేఖనంగీకరించి రాజీకుదుర్చుకొనుసట-వ్యక్తిగతముగ అందరూ ఉప్పు చేసుకొనుసటకనుమతించునట. ఉప్పు సత్యాగ్రహుల నందరిని విడుదలసేతురట. తమ రాకనపేక్షించుచున్నారు.

గాం :- మంచిది - సంతోషమే శాంతి సమరమున సమాధానము సర్వసమ్మతముగదా. రమ్ము పోవుదము.

శాం :- భారతీయులారా, ఉప్పు సత్యాగ్రహ విజయమునకు విజయోత్సవముల సాగించెదరుగాక !

( తెరపడును) - పాట-"జై స్వదేశ, జై"-మహాత్మా-(నిష్క్ర)

( చతుర్థాంకము )

7 వ రంగము - బొంబాయి ప్రాంతము.

[ ప్ర-సర్దార్ వల్లభాయ్ పటేల్ చిన్న నోటుబుక్కులో లెక్కలు చూచుకుంటూ ]

పటేల్ :- (స్వ)

ప్రభుత్వంవారితో రాజీ విధానం భగ్నమైనట్లే. యథాప్రకారం సత్యాగ్రహుల నిర్బంధములు సాగుచునేయున్నవి. అనుకున్న ప్రకారం రాజకీయ ఖైదీల విడుదల జరుగనేలేదు. ప్రభుత్వ ప్రకటనలలో యున్న విశాల భావములు ఆచరణలో కనిపించవు. పన్నుల నిరాకరణోద్యమమును ఆపుటయే అనర్థకమైనది. ప్రభుత్వ సేవకులగు భారతీయులే ప్రజలను కడుంగడు హింసించుచున్నారు. ఈ నిరుత్సాహమడంచుటకు వ్యక్తి సత్యాగ్రహమే సాధనము.

ఎట్టి విషమ పరిస్థితులలోను అగ్ని పరీక్షలకు లోనుగాగల శాంతశూరులజాబితా సిద్ధముగనేయున్నది. దేశద్రోహుల జాబితాగూడా

సిద్ధముగానేయున్నది. ఔరా! దేశద్రోహులారా, ఇదే మీకు మా హెచ్చరిక.

గీ॥ భారతీయుల బాధించు పాపులెవరో
జాబితాయున్నదిదుగో, హెచ్చరికమీకు!
దేశ విద్రోహులార, విదేశశక్తి
నమ్ముకొని యెన్ని నాళ్లుందు రిమ్మహి నిక॥

(ప్రవేశం జవహరు)

జవ :- నమస్తే, సర్దార్‌జీ.

ప :- నమస్తే జవహర్, బ్రిటీష్ రాకొమారుని బహిష్కార మును జయప్రద మొనర్చినందుకు మా అభివందనములు.

జ :- తమ బార్డోలీ పథక మెంతలోనున్నది. అదియేగదా మన ఆఖరు ఘట్టము.

ప:- మహాత్ముడు సమిష్టిసత్యాగ్రహమంతయుఆపివేసెనుగదా.

జ :- గాంధీ ఇర్విన్ రాజీవిధానమున ప్రభుత్వమువారి విధులు ప్రభుత్వమువారు పూర్తిగా నిర్వహించినగదా. దేశమున నిరుత్సాహామే ప్రబలుచున్నది.

ప :- దేశమున ఈ అల్లరులు హత్యలు మన కార్యక్రమము నంతయు తలక్రిందులొనర్చినవిగదా మిత్రమా.

జ :- అవును, ఇటు 'లాహోర్' బెంగాలు హత్యలకుతోడు అటు మలబార్ 'మోప్లా' తిరుగబాటు మన శాంత సమరమునకు మరీ విఘాత హేతువులైనవి.

ప:- కనుకనే మహాత్ముడు ప్రత్యక్ష చర్యలన్నింటినినిలిపివేసెను.

జ :- అట్లయిన ప్రస్తుత కర్తవ్యము ?

ప :- ప్రస్తుత కర్తవ్యము నిర్మాణ కార్యక్రమమే.

జ :- ప్రభుత్వ శక్తులదియును సాగనీయనిచో-

వల్ల :- సాగనీయరు - నిశ్చయమే సందియ మెందుకు. గాంధీ టోపీని ధరించుటయే నేరమైనప్పుడు దేశమున ఇంక యేపని నేరము గాదు?

జవ :- అట్లని మనమిక యూరక నిద్రపోవలసిన దేనా ? దేశీయులు నిరుత్సాహము చెందుచున్నారు. ముఖ్యముగా యువకశూరులు మూతివిరుచుచున్నారు.

వల్ల :- మరీ ముఖ్యముగా ముసల్మాను దుండగీడులు ముందు ముందుకు దూకుచున్నారు. వారిని రెచ్చగొట్టు ప్రభుత్వ దుష్టశక్తులు గూడ మరీ విర్రవీగుచున్నవి. ఇదుగో జాబితా - ఇందు దుష్టశక్తులన్నియు నిరూపింపబడినవి.

జవ :- అవును మీ జాబితా చిత్రగుప్తుని లేఖనమే సందేహమేమున్నది. కాని ప్రస్తుత కర్తవ్యము ?

పటే :- కర్తవ్యము గాంధి మహాత్ముడే నిర్ణయించెనుగదా. వ్యక్తి సత్యాగ్రహమే - ఇదుగో ఆసేతుహిమాచలపర్యంతము అగ్ని పరీక్షకులోనుగాగల అచంచల అసహాయ శూరుల జాబితా-మిత్రమా.

ఉ॥ 'ఒక్కడేచాలు నిశ్చల బలోన్నతు-డెంతటి కార్యమైనఁదా
జక్కనొనర్ప కౌరవు లసంఖ్యలు-పట్టిన ధేనుకోటులన్
జిక్కగనీక' అర్జునుడజేయ్యు పరాక్రమమున్ వెలార్చడే,
అక్కరణిఁ భవత్ ప్రతిభ యయ్యది యొక్కటెచాలదే సఖా॥

కావున అల్లరుల కాలవాలమగు సమిష్టి సత్యాగ్రహముకన్న వ్యక్తి సత్యాగ్రహమే పటిష్టవంతమగును. రమ్ము యువకాంగ్రేసరా మహాత్ముని సందర్శించి అన్నివిషయములు నిశ్చయింతము వృథా

చర్చలకిది సమయముకాదు ( వెనుకన సి. ఐ. డీల అలజడికనిపెట్టి ) అరుగో, గూడచారులు మనను వెంటాడుచునేయున్నారు.

జవ :- వారునూ భారతీయులేగదా సిగ్గు, సిగ్గు.

పటే :- అట్లనకుము వారులేనిచో ప్రభుత్వ మీ వరకే పడిపోయియుండెడిది.

ఉ॥ గొడ్డలి పెద్ద ఆయుధమె - కోయునెవృక్షము, దానికర్ర ఆ
గొడ్డలిదూరి మానవుని కూరకరంబున నాట్యమాడకన్
విడ్డురమేల! దేశవిషబీజములే ప్రభుహంతకాళి చే
గొడ్డలి కర్రలై మనకెగూర్చునుహాని, విషాదమేగదా

జవ :- లెస్సగా పల్కితిరి, సర్దార్జీ
(మూలగా భేషజం మసలుచున్న అలజడి కనిపెట్టి) భాయీ, ఆవ్, ఇదరావ్, భయములేదు-ఇటురమ్ము-నీవునూ మాకు ఆప్తుడవే.

భేష :- (ప్రవేశించి తారట్లాడు చుండగా జవహార్ రెక్కపట్టుకొని తమముందు నిలువబెట్టి) ఎవరు నాయనానీవు. ఫరవాలేదు చెప్పుము.

భే:- తమను ఊరికే చూదామని సార్, ప... పనేమీ లేదుసార్ (గాభరాగా)

పటేల్ :- మమ్ములను అన్నిసభలలో చూస్తూనే వుంటావుగా, ఎప్పుడూ చూడలేదా.

జవ :- ఆ జేబులోని నోటు బుక్కేమిటి బాబూ,

భే :- అది నా సొంత డైరీసార్.

జవ :- ఏదీ చూడవచ్చునా. మాసంతకము కావలెనా (బుక్కు బైటికితీసి చూచుచుండ)

భే :- అవునుసార్, కాదుసార్-ఏంలేదు సార్.

జవ :- ఓ, నీవు మాసహచరుడవే మేమిప్పుడు మహాత్ముని ఆశ్రమమునకు పోవుచున్నాము, నీవును రావచ్చును-నీకుకావలసిన అన్ని విషయములు మేమే చెప్పెదము-భయపడకుము పోలీస్ చేలా భాయ్, ఫికర్ నై, ఫికర్ నహి (వీపుతట్టి నోటుబుక్కునిచ్చి ప :- జవ :- ఇరువురు నవ్వుకుంటూ నిష్క్రమింతురు.)

భే :- ఆహా ! ఏమి యీ మహానుభావుల అద్భుత ప్రభావము-నిజముగా ఈ పొట్టకూటికై నేనిన్నాళ్లనుంచియు చేయుచున్న పనుల న్నియు నీచాతి నీచములేగదా - మహాత్ముని దివ్యప్రభావమింకెంతగా నుండునో-

కటకటా !

గీ॥ భారతీయునడనై పుట్టి, భారతీయ
వీర వీరాధి వీరుల ప్రేమగనక,
పొట్టకూటికి నాబుద్ధిఁ గట్టపెట్టి
ద్రోహినైతి, భారతమాతరో! నమోస్తు॥

(నిష్క్రా...ను)

—తెర లేచును—

(మహాత్ముడు, చర్ఖా తిప్పుతూ)

— పాట —

గాం :- వడుకుము దారము, భాయీ॥
భాయి భాయి, చరఖాయిడు దారమె
భరతభూమి కరువేమిలేక
భాగ్యము గూర్చునుగా, భాయీ॥ వడుకుము॥
రాట్నమహా పరాత్పరుని చక్రమై

కాటకంబులను గడుపుగా॥
కడుసుఖమిడుగాదే, రాట్నము ॥వడుకుము॥

( ప్రవేశం - పటేల్, జవహర్ )

ఇద్దరూ :- నమస్తే, మహాత్మాజీ

గాం :- నమస్తే, దేశభక్తులారా. సర్దార్జీ, బార్డోలీలో మరల పన్నులు దాదాపు పూర్తిగా చెల్లించిరనుకుంటాను.

పటే :- సంధిషరతుల ననుసరించి మనమే సడలించితిమి ప్రభుత్వసంధి యీరీతి భగ్నమగునని మనమూహించలేదుగదా.

గాం :- అట్లయిన వ్యక్తి సత్యాగ్రహమునకు అర్హుల జాబితా సిద్ధపరిచితివనుకుంటాను.

పటే :- ఇదిగో సిద్ధముగానున్నది. మహాత్మా.

గాం :- మంచిది. సమిష్టి సత్యాగ్రహమున హింసాకాండ తాండవమాడిన హేతువులను గమనించితివా, జవహర్.

జవ :- గమనించితిని, మహాత్మా ప్రభుత్వోద్యోగుల రాక్షస కృత్యములే ప్రజల సహనమును భగ్నపరిచినవి,

గాం :- అదిఎట్లుధీగా గ్రేసరా ప్రజలలో అహింసా సిద్ధాంత మింకనూ బాగుగా పట్టుబడలేదన్నమాటయే.

పటే :- అవును మహాత్మాజీ,అందరునుమహాత్ములుకాలేరుగదా.

గాం :- అట్లయిన మీ మహాత్ముడొక్కడే సత్యాగ్రహమునకు గడంగును మీరందరు నిర్మాణ కార్యక్రమమందే నిమగ్నులై యుండెదరుగాక.

జవ:-ప్రజలునిరుత్సాహపడెదరేమోయనిశంకించుచున్నాము.

పటే :- నిర్మాణ కార్యక్రమ మనగా ముఖ్యాంశము ఖద్దర్ ప్రచార మేగదా.

గాం :- అవును ఖాదీ ప్రభావమును జనులు బాగుగా గుర్తించి నట్లులేదు, మిత్రులారా,

సీ॥ ఈ రాట్నపుంచక్రమే విష్ణు చక్రమై
సీమయంత్రాసురుఁ జీల్చివైను
ఈ రాట్నపుం కదురా రామబాణమై
పరదేశ వర్తకాసురునిజంపు
ఈ రాట్నపున్ నూలు (శ్రీ)రాము వింటితా్రై
మై మోగ్రి దుష్టరాజ్యముఁ గలంచు
ఈ రాట్నపున్ వస్త్రమే రామరక్షా
కవచమై స్వరాజ్యంబు పాదుగొల్పు

గీ॥ రాట్నమే రామునర్ధాంగ లక్ష్మిసీత
రాట్నమే దేశసౌభాగ్యరాశి గురియు,
రాటమే సర్వసుఖముల కాటపట్టు
రాటము స్వతంత్రి సాధకవాటు మహాహా !

అదియునుంగాక మరియొక ముఖ్యాంశము గూడనున్నది. మన దేశమున అంటరానితన మనునది అత్యంత అవమాన హేతువైనది. అయ్యది పూర్తిగా నిర్మూలించ బడనిదే మనదేశమునకు విముక్తి లేదు. ఆ అంటరానితనము నాధారము చేసికొనియే ప్రభుత్వమువారు మనపై అవమానకరమైన పరిపాలనా విధానమును రుద్దబోవుచున్నారు. ఈ విషయమున నాప్రాణమర్పించుటకు సిద్ధముగ నున్నాను.

పటేల్ :- తాము వచించిన నిర్మాణ కార్యక్రమము సమగ్రముగ సాగుచుండవలసినదే కాని, తమకొక్క మనవి గావింపవచ్చితిమి.

గాం :- తెలుపుము సర్దార్ జీ - కార్యనిర్వాహకులు మీరే గదా కాంగ్రెస్ అధ్యక్షా.

పటేల్ :- వ్యక్తి సత్యాగ్రహమునకు కావలసిన సన్నాహము లన్నియు పూర్తియైనవి.

జవ :- ఆసేతు హిమాచల పర్యంతము శాంతవీరులు సిద్ధముగ నున్నారు, మహాత్మాజీ.

గాం :- నేనే ముందు శాసన ధిక్కారమునకు సిద్ధముగా నున్నాను.

పటేల్ :- వ్యక్తి సత్యాగ్రహులజాబితా జాగ్రత్తగా పరిశీలించి యుంచితిని.

గాం :- మరల అల్లరులు దుండగములు చెలరేగవని మీాకు పూర్తిగా నమ్మకమున్నచో ఈక్షణమే సాగింతము.

జవ :- ఉన్నది మహాత్మా, అందరము సిద్ధముగా నున్నాము.

పటేల్ :- నేనునూ సిద్ధమే.

(భేషజం పరుగెత్తుకుంటూ వచ్చి)

భే :- మహానాయకులారా, మహానాయకులారా.

గాం :- ఏమది యువకా, నీ భయహేతు వేమి ?

జవ:- ఈతడు పోలీసు సి.ఐ.డీల చేతిలో కీలుబొమ్మ, మహాత్మా.

భే :- నిజము, మహాత్మా, నిజము. నేను ద్రోహినే - దేశ ద్రోహిని,

గాం :- అయిన నీకిప్పుడేమి కావలయును.

భే :- మహాత్మా - మహానుభావులారా, మరి, చెప్పుటకు నోరాడుటలేదు మీా అందరిని - వైస్రాయిగారు.

ప :- ఊఁ! అరెస్టుచేయమనినారా, చెప్పుము భయమెందులకు.

భే :- అవును - అంతే - ముందుగా తమకు తెలుపుదమని వచ్చాను మన్నించాలి.

జవ :- ఇన్నాళ్లనుంచియు అన్ని సంగతులు పోలీసువారికి నీవే ముందుగా తెల్పుచుంటివిగదూ.

భే :- అవును, నాయకాగ్రేసరా, నాపాపములను మన్నించి నన్ననుగ్రహించాలి - నేను పూర్తిగా పశ్చాత్తాప పడుచున్నాను.

పటేల్ :- సరే, నీవు మా కాంగ్రెస్ శిబిరమునకురా-నిన్నింకను పరిక్షించవలె.

భే :- చిత్తం — (నిష్క్రే - ను)—

మహా :- సరియే, మనకు ఆడపోయిన తీర్థము ముందుగా ఎదురైనది. మనమిక నిర్బంధవాసమునకు సిద్ధముగా నుండవలసిన దే-కాంగ్రెస్ అధ్యక్షా, కాంగ్రెస్ కార్యనిర్వాహణ కార్యక్రమ మాగకుండ తగునేర్పాట్లు గావించి సిద్ధముగ నున్నారని యెంచెద.

ప :- అన్ని యేర్పాట్లును సిద్ధపరిచితిమి మహాత్మా-అవును అవసరమైనచో వందలమంది అధ్యక్షులు ఒకరి తరువాత మరొకరు కార్యగంగమున దుమికి కారాగారమున చేరుటకు సిద్ధముగనున్నారు.

గీ॥ కాంగ్రెసు రథం బిదేసాగికాంతులలర
ఆగకయె అవిచ్ఛిన్నమై యరుగ గలదు,
ముప్పదైదుకోట్ల భరత పుత్రులెల్ల
కాంగ్రెసేయువె, శాంతసంగరమునందు
అపజయము లేదహింసా మహాశయమున॥

గాం :- భేషు, భేషు, లెస్సగా పల్కితివి సర్దార్జీ.
(ప్ర :- పో - ఆ & ఖాదర్)
పో-ఆ :- నమస్తే-నాయకాగ్రేసరులారా, ఇదుగో, వారంట్.
గాం :- నమస్తే, మరి మాకు సంకెలలేవీ,

పో-ఆ :- అవి, పారిపోవువారికిగాని, వరియించి జైళ్లకరుదెంచు తమవంటి మహాత్ములకుగాదు - ఈ పాపకార్యమున కరుదెంచినందుకు మన్నించాలి, మహాత్మా.

పటేల్ :- ఏదీ, ఆచారంటూ ?

పో-ఆ :- ఇదిగో మహానుభావులారా, ఇది మహాత్మునకు, మా శుభ లేఖ

పటే :- యేదీ.

పో-ఆ :- తమరు కాంగ్రెస్ అధ్యక్షులుగదా - ప్రత్యేకముగ వచ్చునేమో - కార్లు సిద్ధముగ నున్నవి.

జవ :- మరి నాకేదీ ?

పో-ఆ :- అదియును ప్రత్యేకముగ వచ్చును.

గాం :- మేమునూ సిద్ధముగనున్నాము.

పటే :- ఓహో ! కాంగ్రెస్ సంస్థనే నిషేధింతురు గాబోలు. ఇదిగో అధ్యక్షుల జాబితా నా తరువాత రాజేంద్రబాబు అధ్యక్షుడగును.

గాం:- ఠీక్ హై! నాకిక సెలవు. (గాం. పో-ఆ. ఖా. ప. నిష్క్రమించు...రు)

జవ :- (స్వ) మా ఆనందభవనము కాంగ్రెస్ భవనమైనది గదా, మా నివాసమిక కారాగారామే యగునుగాక ! (కొంచె మాలోచించి) ప్రభుత్వమువారిమెత్తు కాంగ్రెస్ సంస్థనే నిషేధింతురనియే తోచెడిని-అందుకనియే మాకు ప్రత్యేకముగా వారంటు పంపలేదు. "వినాశకాలే విపరీతబుద్ధిః" కానిమ్ము. ప్రభుత్వమువారి ఆట కట్టు ఆఖరు ఘట్టము కుదెంచు చున్నది. ఓ, యువకాంగ్రెసరులారా, బహుపరాక్. దేశసేవా పరాయణులారా, మేల్కొనండి. (నిష్క్ర...ను)

---

# 8 వ రంగము

(సీను) న్యాయస్థానం దాగి

(ప్రవేశం - రావుసాహెబు - అధికారి)

(తెరలో - తుపాకీ పేల్పులు - "మారో, మారో" కేకలు.)

అధికారి :- అరుగో, మళ్లీ, తూడీలు తూడీలు వస్తున్నారు- వీళ్లకూ శిక్షలు వేయటానికి, తీర్పులు వ్రాయటానికి మాదుంప తెగి పోతున్నది. ఒకవేళా లేదు పాళా లేదు. ఎప్పుడొస్తే అప్పుడు వారంట్లు వ్రాయించాల్సిందే.

రావు :- గుడ్ మార్నింగ్, అధికారిగారు, మీరు, ఆనరరీ మేజిస్ట్రేటు కావటం మా అదృష్టమే సార్.

అధి :- ఏమదృష్టమయ్యా, చస్తుంటే - సొంత పెండ్లానికైనా శిక్ష వెయ్యాల్సిందే - ఆ పోలీసు వారేమిచెప్తే అదల్లా చెయ్యాలి. లేకపోతె మనపని గల్లంతే - ఛా, వెధవ ఉద్యోగం.

రావు :- అదేమిటి బాబూ, ఎంతఅధికారం ఎంతగౌరవం, ఎంత ఘరానా - అలా అంటారేం.

అధి :- సరేలేవయ్యా, సంగతేమిటి ?

రావు :- మా వెధవ వొకడున్నాడండీ - వద్దంటే వినకుండా ఆ గాంధీటోపీ సత్యాగ్రహంలో ఇరుక్కున్నాడు.

అధి :- ఇదుగో, రావుసాహెబుగారూ మనపెత్తనం ఏమీ లేదు - తీర్పులుగూడా ఆ పోలీసువారే వ్రాసిస్తారు.

రావు :- తమరలాఅంటే ఎలా - ఏదో చూడాలి.

అధి :- అయితే "అపాలజీ" ఇప్పించవయ్యా - క్షమాపణ చెప్పమనూ - చూదాం.

రావు :- పారిపోయింది-మా ఆయనవుంటే... ...అన్నట్లుంది, మీరు చెప్పటం - మనమాట ఇప్పటి యువకులు వింటారా, మనకే

వాతం చెప్పుతున్నారు. ఇంట్లోవున్న విదేశీగుడ్డలన్నీ చాటుగా మాటుగా స్వరాజ్య మీటింగులలో చలిమంటలు వేస్తున్నారు.

అధి :- అయితే, పోలీస్ వారిని ఆశ్రయించాల్సిందే, మన దేమీ లేదు.

రావు :- అంతేనా-ఏదోకడుపుతీపితో అడుగుతున్నా ఆ పక్కింటి వెధవనిజూచి మావాడు చెడిపోయినాడు.

అధి :- చెడిపోవటం ఏమిటయ్యా, వాంళ్లేస్వరాజ్యం చేస్తామంటుంటే - అరుగో,చూడు ఎంత హుషారుగావున్నారో.

రావు :- పోనీ, కాస్త 'ఎ' క్లాసన్నా వేయిద్దురూ-మావాడు వట్టి జోగులు వెధవ.

అధి :- చూదాంలేవయ్యా, ఇక నువ్వు తప్పుకో.

(ప్రవేశం- దేశసేవకులను వెంటబెట్టుకొని)

శాం-వీర, ధీర :- జై మహాత్మాగాంధీకి భారత్ మాతాకీ మాకు జైలు చూపించండి, సార్, ఊరకా ఊరూరతిప్పుతూన్నారు మమ్మలను.

అధి :- ఏమిటది, సార్జంటుగారూ, వీరిని ఏజైలుకు నేశాం.

ఖా :- సెంట్రల్ జైలుకుసార్.

అధి :- అక్కడ ఎందుకు వీరినుంచలేదు ?

ఖా :- అక్కడా ఒక్కచిక్కాకూడా చోటు లేదు సార్.

అధి :- వరండాలలో తడికెలు కట్టించకపోయినారా.

ఖా :- వరండాలన్నీ హిందర్కే హాయిపోయినాయ్ సార్.

అధి :- అయితే అడిషనల్ జైలుకు తీసుకొనిపో.

ఖా :- అక్కడా నిండిపోయ్యార్, సార్ !

అధి :- అయితే టెంపరరీజైల్.

ఖా :- అవ్వీ అన్నీ నిండా, నిండా హున్నాయ్ గాంధీగార్ని వదిలీవేస్తే యీ గుంపుల్ గుంపుల్ తగ్గిపోతాయ్ సార్.

అధి :- వెయ్, చుప్, ఆ సంగతి మనకెందుకు. అయితే కాం పౌండ్లలో వుంచండి కాంగ్రెస్ ఖైదీలు పారిపోతారనే భయంలేదుగా.

వీర :- మనమంతా ఖైదీలమే సార్, మీరున్నది పెద్దజైలు, మేమున్నది చిన్నజైలు.

( ప్రి - కాంతారావు & హరిజన - జై మహాత్మాగాంధీకి )

అధి :- వారెవరు ?

ఖా :- ఎవరుమీరు ? ఆ గాంధీటోపీలు తియ్యండి

కాం :- ఆమాట అనగూడదు తప్పు - జై మహాత్మగాంధీకి.

ఖా :- ఆ కేక వేయగూడదు అరెస్టుచేస్తాం, జాగ్రత.

హరి :- మేం యాత్రికెళ్తున్నాం గదంటయ్యా.

ఖా :- ఏం యాత్రికీ-యాత్రికుపోతూ ఆమాటలేంటీవోయ్.

హరి :- గాండిమాత్ముడ్ని చూట్టానికి, మీరు రారూ మరి ?

కాం "యెరవాడా" పోతున్నామయ్యా.

ఇద్దరు :- గాంధిమహాత్మకు జై.

ఖా :- మీకీ అరెస్టు చేస్తున్నాను-వీరికిగూడా శిక్షచెప్పండి, సార్.

అధి :- వేసుకో, 6 నెలలు - తరువాత వ్రాసుకుంటాం, తీసుకుపో, వారంటు వ్రాయించుకో.

ఖా :- ఇంతామందిన్ని ఎక్కడా పెట్టాలి సార్.

అధి :- ఎక్కడా చోటులేకపోతే డేరాడూన్ పంపు-లేకపోతే బర్మాపంపు - ఊ - వెళ్లండి.

వీర :- సార్ మీరుగూడా రాజీనామాయిచ్చి మాతోరండి సార్ - కరణాలు రాజీనామాలిస్తున్నారు - పటేళ్లు వస్తున్నారు - గుమాస్తాలుగూడా దిగుతున్నారు - ప్లీడర్లు వచ్చేశారు - ఇక మీరూ పోలీసులూ వస్తే ఆటపూర్తిగా కట్టుతుంది.

అధి :- ఊ - పోలీస్.

(తెరలో - పోలీస్ విజిల్)

ఖా :- అదిగో, మాలాతీచార్జి "పెరేడు"కు(తర్ఫీతుకు) సమయ మైంది- రండి.

అందరు :- జై మహాత్మగాంధీకి.

(నిష్క్రి...రు)

## 9 వ రంగం

తెరలేచును - (జైలుసీను)

[ జైలులో ఒక మూలడేగాడున్‌లో జవహర్ మరియొకమూల యెరవాడాలో మహాత్ముడు - మధ్య నాయకులందరు. ]

[ పటేల్, మాల, ఆం - రత్న-శాంరాం, వీర, ధీర, శాంతా రావ్, హరిజన్ వగైరా ]

గాం :- (చర్ఖాతిప్పుతూ) — పా ట —

"వైష్ణవ జనతో కేహీనహీయే - జో, పీడపరాయి, జాణే గే
పరదుఃఖే ఉపకారక రేతో యే మన అభిమానన ఆణే రే॥"

జవ :- (మరియొక మూల స్వీయ చరిత్రి రచించుతూ)
ఈ ఆటోబైగ్రిఫీ వలన ఏమి ప్రియోజనము. ఏమో కానిమ్ము రచించెద.

అందరూ :- — పా ట —

దండాలు దండాలు భరతమాతా,
నీ-అండా మమ్ముండనీయె భరతమాత॥

1. లాటీదెబ్బలకైన భరతమాతా
లేక-మేటీ తుపాకికైన భరతమాతా
వెరచీపోమమ్మతల్లి భరతమాతా
నిన్ను-మరచీపోమమ్మతల్లి భరతమాతా॥

2. సాటీవారల్లోను భరతమాతా
మాకు-సిగ్గైపోతున్నాదె భరతమాతా
మేటీ మహాత్ముండె భరతమాతా
మంచి-సూటీమార్గముచూపె భరతమాతా॥
3. దండాలు దండాలు భరతమాతా
దండాలు దండాలు భరతమాతా॥

(మరల మరల తన్మయత్వమున పాడుతూ ఒక్కొక్కరు నిద్రపోవుదురు.)

(ప్రవేశము భరతమాత జైలులో-అందరి ముఖములు పారజూచి)

— పాట —

ఆహా ! నాకేదిదారి, దీననైతిగా॥
కన్నసుతుల కీ గతులను కలుగజేసితే విధీ-
ఎన్నటికో నావిముక్తి
కనులగాంచవా ॥ ఆహా ॥

అయ్యయ్యో, నాబిడ్డలకా ఈఅగచాట్లు! సహజపరితాప శాంత స్వభావసత్పురుషులగునా భరతసంతతికా ఈనిర్బంధములు, ప్రపంచమునన్ గల ఏ దేశమాతృగర్భమునకు నాపైడిగర్భమూతీసి పోవును! ఏ దేశ ప్రజలకు నాధీర ప్రజలు తీసిపోయెదరు! ఓ భారతభక్తపుంగవులారా, ఓ పరమ యోగులారా, వీరస్వర్గ వీరాధివీరలారా, ఓ అవతార పురుషులారా, మీరెల్లరు నాభాగ్యగర్భమున తరియించినవారేగదా! ఈనాటి నాయగచాట్లకు మీరైన వీలఅడ్డుపడరు. ఔరా! నాబిడ్డలారా, మీకా ఇట్టి కటికనిర్బంధములు! మీ ప్రశాంత పౌరుషప్రతాపములకిదియా ప్రతిఫలము!

మ॥ అకటా! నాదు బలప్రతాపములు
శూన్యంబయ్యెనా ! నాసుతుల్
సకలోర్వీతల మేలజాలిన మహా
శక్తిన్ విజృంభించి నే
టికి యీబంధములన్ కృశించుచును
"లాటీదెబ్బలకే సైచు వా

రికథన్యాత్ములుగాకపొవుదు రె !
లేడే, దైవమెప్పట్టులన్॥

హా, కృష్ణా ! ఆపద్బాంధవా ! నీవును నాపై దయతప్పితివా ? నా మహాత్ముడు నీస్వరూపుడేగదా ! నీకునూ అసాధ్యమాయెనా, నేనీబాధలు కన్నులారగాంచుచు కడుపునిండ దుఃఖ మనుభవించవలసిన దేనా ! రావా, లేవా, గనలేవా, వినరావా, దయలేదా, హా! దుర్భరము, దుర్భరము. ( మూర్ఛిల్లును )

( ప్రవేశము బాలకృష్ణుడు - మురళివాయించుతూ )

— పాట —

ఎంతటివారలకైననుగానీ చింతలు తప్పవుగా। ఇలలో ॥చింత॥
కర్మబద్ధులకు గడపిన ఇడుములు కడు సుఖమిడుతుదిలో ॥ఎంతటి॥
భారతభూమికి బాధలు దొలగ-తారకమంత్రముగాంధియెగాదా
త్మారమకెల్లను మోక్షము నొసగ శాంతిసుధామయు గాంధియేగాదా॥

ఆహా ! ఎన్నాళ్లకెన్నాళ్లకు మరల నా జన్మస్థానదర్శన భాగ్యములంభించినది !

మ॥ ఇదియే నే జనియించినట్టి స్థలమిం డెన్నాళ్లకుఁ వచ్చితి
య్యది నేరస్థులకున్కి-పట్టని యసహ్యం బెంతమాత్రంబు గా
దిది నేరస్థుల బాగుచేసి ధరన-న్యాయంబుఁబోగొట్టి స
మ్మోదమున్ గూర్చెడి చంద్రశాల, ఇదెనా పుట్టినిల్లుగన్గొంటి రే॥

ఆహా ! నేటికిగదా నాజన్మస్థానమున కగ్రస్థానములభించినది! పతితులకీ కారాగృహమెంత పరాభవసూచకమో పరమపావనులగు దేశభక్తులకయ్యది అంతగౌరవ కారణమగుచున్నది. అది ఎట్లందురా,

సీ॥ గలగల నినుపసంకెలలు తాళము వేయ
శ్రీరామ భజనంబు సేయవచ్చు,
ఇతర వ్యాసంగంబు లేమియు లేకుంట
దైవమున్ స్థిరబుద్ధిఁదలచవచ్చు,
వ్యావహారికమందు పాల్గొనకుంటచే
విశ్రాంతిగా బుద్ధి పెంచవచ్చు

పలుబాధలనుభవింపగ విధియగుటచే
కష్టానుభవమెంతొ గాంచవచ్చు,

గీ॥ కటికి నిర్బంధవాసమే గలుగుగాన
స్వేచ్ఛగా నుండ నభిలాషపెచ్చు పెరుగు,
కృష్ణజన్మస్థలమటంచు కీర్తిగాంచె
దేశభక్తుల కీశిక్ష దీప్తిగాదె !

దేశసేవాదురంధరులారా, భారతీయ వీరాధివీరులారా, మిమ్మిదే గౌరవించి కృతార్థుల సేయుటకై నాజన్మస్థానమునకు రప్పించితిని. మీరిక ధన్యులు-ఇదే మీకు మోక్షద్వారము తెరుచుచున్నాను. అదియునుగాక, చరిత్రాత్మకముగ ఒక్కొకధర్మ సంస్థాపనావసరమున ఒక్కొక మహామహులకీ చెరసాలవాసము తప్పలేదు.

సీ॥ క్రూరహిరణ్యాక్షు గూల్చుచో భూదేవి
పాతాళమున చెరబట్టబడియె ।
గర్వాంధుని హిరణ్యకసిపుఁ గూల్చెడువేళ
ప్రహ్లాదునకు జైలుప్రాప్తమయ్యె
చెనటి రాక్షస రావణుని గూల్చవలయుచో
సీతయే చెరలో వసించవలసె,
కటికిమూర్ఖుని కంసుఁగడతేర్చ దేవకీ
వసుదేవులకు జైలు వాసమయ్యె

గీ॥ ఇన్నియేటికి భువిపాప మిచట్నె న
జైలువలననే అటునిటు సాంతమగును
నేడు భరతభూమికి 'జైలు' నిశ్చయముగ
బానిసత్వ విముక్తియే, భరతమాత !

మీ శాంతి సమరమే ప్రపంచమునకు మార్గదర్శకమై అజ్ఞానాంధమును బాపుగాక ! తల్లీ, భారతమాతా !

ఎట్టి ధీరచరితులకును కర్మవిధానము తప్పదుగదా
అన్నియు తెలిసిన నీవంటి తేజోశాలి యిట్లుదుఃఖింపదగునా !
ఆనాటి నీ పేటిదశ యీనాటి కిట్లయ్యెనుగదా ! నేటి నీదీనదశ రేపెట్లుండునో జూచెదవుగాక !

గీ॥ అస్తమయభానుడల పశ్చిమాద్రి నుంకి
చండమార్తాండుడగుచు ప్రచండతీక్ష్ణ
మొప్ప ప్రత్యూషమీయడే యుర్వికెల్ల ?
కాలగతి యట్లె విక్రాంతి గాంతువమ్మ॥

నీవు వీరమాతవుగదా, లెమ్ములెమ్ము, నీపుత్రుల కుత్సాహము గలిగించుము. (వీపుతట్టి అదృశ్యుడగును. ని......ను)

భ-మా :- (ఉలికిపడి లేచి) అవును, కృష్ణా, వీరమాతనే-నిజముగా వీరమాతనే కాకేమి? ఓ, నా బిడ్డలారా, పోరుడు, పోరుడు, స్వాతంత్ర్య విజయము సాధించుడు-శాశ్వత సుఖము జూరగొనుడు-నేనిక దుఃఖింపను. భయపడను, భంగపడను, బ్రతిమిలాడను-పరమానందమున భరించెద-పరతంత్రజీవనము పారఁగోలెద - సర్వసౌభ్రాతృత్వ విజయము జూరగొనెద-పోరుడు. — పాట —

పోరుడు పోరుడు వీరులు మీరే"
లాటీదెబ్బల బాధలు రానీ, మేటితుపాలు పెటపెటమననీ,
వెరువక విడువక వెనుకకు మరలక
పోరుడు పోరుడు, వీరులు మీరే॥

(అదృశ్యమగును. ని...ను)
(ఖైదీయులందరు ఉలికిపడి లేచి)

— పాట ---

దండాలు దండాలు భరతమాతా,
నీ | అండామమ్మండనీయె | భరతమాతా॥

(ప్రవేశము పో. ఆఫీసరు.)

పో-ఆ :- | (గాంధిగారి కొట్టువద్దకుజని
అ-ఖా :- | ఖైదీలందరికి మిలిటరీ శాల్యూట్ చేసి)

పో-ఆ :- మహాత్మాజీ, తమందరిని విడుదల చేయుమని ఉత్తర్వులు సరాసరి యీసారి లండన్ నుంచియే వచ్చినవి. తమ పూనాపథకము అనగా ఈ 'యెరవాడ అంగీకారము' ననుసరించి స్వరాజ్యచట్టము తయారుచేసెదరట-తమను వెంటనే 'రౌండుటేబిలు' సమావేశమునకు తీసుకొనిపోయి అన్నివిషయములు చర్చింతురట ఇక రానున్న

ఎన్నికలలో కాంగ్రెసువారే మంత్రులవుతారట - దయచేయండి, మిమ్మందరిని ప్రభుత్వమువారు విడుదల చేయుచున్నారు.

అందరూ :- జై మహాత్మగాంధీకి, భారతమాతకూ.

గాంధి :- (చిరునవ్వుతో) పటేల్ భాయ్. మీ కాంగ్రెస్ మహాసంస్థ రాజ్యాధికారము స్వీకరించుటకు సిద్ధముగనున్నదా.

పటే :- తమ ఆశీర్వచనము.

గాంధి :- జవహార్ ధీర యువకాగ్రేసరచక్రవర్తులు రాజ్య చక్రమును చేబట్టుటకు సిద్ధముగ నున్నారా!

జవ :- అంతెయూ మీఆశీర్వచన భాగ్యమేగదా.

గాం :- శాంతి సైనికులారా, ఇంకనూ పోరాడుడకు సిద్ధముగ నున్నారా,

అందరూ :- సిద్ధము-సిద్ధము మహాత్మా.

పో-ఆ :- సమాధానము కుదురుటకు శ్రీ మాలవ్యాపండితుడు ప్రభుత్వమువారితో జరిపిన మంతనములు చాలా ప్రశంసనీయములు, మహాత్మా.

అందరూ :- పండిట్ మదనమోహన మాలవ్యాజికి జై.

గాం :- ఇక మనమూ (Round Table) గుండ్రనిబల్ల సమావేశమునకు హాజరు కావలసినదేనా. It is round-mind (చిరునవ్వుతో)-కొల్తలులేవు-గుండ్రమే అగునా.

పటే :- హరిజనులకు ప్రత్యేక నియోజకవర్గాల తీసివేయుటలో మన మెరవాడా షరతులంగీకరించిరిగదా. ఇంకసందియమెందుకు-సాగి పోవలసినదే.

జవ:- ఇకశాసనసభలను మనము స్వాధీనపరుచుకొనవలసినదేనా.

గాం :- ఇదివరకు ఓట్లెవ్వరికి యివ్వవద్దని ప్రచారముచేసి గెలిచితిమిగదా!

పటే :- ఇప్పుడు ఓట్లు కాంగ్రెస్ సభ్యులకే యివ్వమని ప్రచారముచేసి గెలిచెదము-ఆ భారమంతయు మన జవహారే నిర్వహించును. గాక!

పో-అ-ఖా :- మహామహులారా, మేమిక మీ సేవకులమే.

ఖా :- తమ రాజ్యం హెష్టాహెస్లా అని యెదురు చూస్తుండాం.

గాం :- ఠీక్ హై, మనమందరము, ప్రజాసేవకులమే.

జవ :- ఉద్యోగులలో భారీమార్పు లేమీ యుండవు-భయపడకుడు.

పో-అ-ఖా :- (మిలటరీ సెల్యూట్ చేయుదురు)

(ప్రవేశము అధికారి & రావు సాహెబ్ ఖద్దరుదుస్తులు ధరించి గాంధి టోపీలు చేతబట్టుకొని)

అధి :- రావయ్యా, ఇంకా భయమెందుకు-నవ్వీన నాపచేనే పండింది.

రావు.సా :- రాజ్యాధికారం మన కాంగ్రెస్ వశమైందన్నమాటే, మహాత్ముడు గెల్చినట్లే.

అధి :- ఇంకా, "అట్లే" ఏందయ్యా, పెట్టూటోపీ.

ఇద్దరు :- (టోపీలు పెట్టి) మహాత్మా, సాష్టాంగ నమస్కారాలు-అపరాధులము.

రావు.సా :- నా రావు సాహెబు బిరుదం చించి మీ పాదాల దగ్గర పడవేస్తున్నాను. (అట్లు చేయును)

దే-సే-లు :- జై మహాత్మాగాంధీకి.

అధి :- నా మేజిస్ట్రేటు పదవి వదలివేస్తున్నాను. మన్నించాలి.

దే-సే-లు :- జై మహాత్మాగాంధీకి.

గాం :- పశ్చాత్తాపమున పతితులూ పావనులే.

జవ :- అంతా మన వాండ్లే.

పటేల్ :- సరే, మీరు మా కాంగ్రెస్ శిబిరానికి రండి ఇంకా పరిక్షించాలి.

జవ :- మహాజనభాయియో, ఇది గాంధీవిజయమునకు ప్రథమ సోపానమేగాని స్వతంత్ర సాధప్రవేశముగాదు.

మ॥ గడచెన్ గాంధియుగంబునన్
ప్రథమ సంగ్రామంబు జైజైయనన్

గడవన్ లేదు స్వతంత్ర
సంగరమునన్ కష్టంబు లెన్నేని, ఏ
ర్పడగా లేదు స్వతంత్ర భారత మహా
రాజ్యంబు పృథ్వీస్థలిన్
జను వేలా, మనగాంధి మార్గమున నే
సాగండికన్ ధీరులై

గాం :- కీక్ హై, కీక్ హై
ప :- మహాజనో
గీ॥ అఖిల మానవ శ్రేయోభిలాషులగుచు
సర్వసమహితతత్వప్రజాను రక్తి
భాయిభాయిగ మనమెల్ల ప్రాణమిచ్చు
శాంత సమరంబె విజయ ప్రశాంతి, జగతి॥
గీ॥ అదుగో ! స్వాతంత్ర్య బడబానలాగ్ని వెడలి
ఆసియా మూల మూలల నావహించి
ఆగకయె అవిచ్ఛిన్నమై సాగునింక
భారతీయుల బానిసత్వంబుపోయె
శాంతిమార్గాన స్వాతంత్ర్య సాధమదిగొ॥

జవ :- దేశసేవకులారా, ఇక రానున్న ఎన్నికలలో కాంగ్రెసుకు పసుపుపచ్చ రంగే శుభసూచకము. ఇక మీ జాగ్రత్తలో మీరుండుడు.

గాం :- కీక్ హై మీ కాంగ్రెస్ రంగు పసుపుపచ్చ-నారంగు ఇక కాసాయిరంగు. (నవ్వుదురు)

దే-సే :- (అందరు శాం-వీర ...) జై కాంగ్రెస్ రాజ్యానికి.

— పాట —

కాంగ్రెసు రాజ్యమె ఘనముగ వెలసినప్రజలకు బాధలుజనునండీ॥
కాంగ్రెసె గాంధీ-గాంధియె కాంగ్రెస్ (మరల మరల 2,3సార్లు)
గాంధి కాంగ్రెసుల కలియండీ॥

1. కాంగ్రెసు సంస్థయె ఘన భారతభువి
కాంగ్రెసు మంత్రులె ప్రభులండీ॥

జయజయ కాంగ్రెస్ జయజయ గాంధీ
గాంధి విజయమిదె గనుగొండీ॥
అందరూ :- జై భారతమాతకూ
పాట :- "జై భారతమాతా॥
జయమాతా ప్రిపూత చరిత సమో స్తే॥
1. వీరచరిత సారతరసుధారస
మధుర మధుర కవితా అలల ॥జై॥

మ ం గ ళ ము

శ్రీల తల్లి భవతు మంగళం । సురత్న
గర్భ మాతృభూమి భవతు మంగళం ।
హిందూ-మా-తా
ధీరమహా-పూరుషులా లా-ధారులు నీపై
ధీ గా, శూరా, వీరా-ఈ
కాలహారణ మేలకగుణ- నేలుతగుణ-మో
ధరణీ-తరుణీ-వరనాగి
శ్రీ భారత-భూ భాగ్యమ-
మా భూరమణీ/-
సురనది భర-వరగిరి ధర-ధరసురవర
హిం-దూ-మా-తా
శ్రీపుణ్యమార్గ దర్శిని, పుండరీక వినుతా-నమ స్తే॥శ్రీలతల్లి॥

ఇది శ్రీవత్సగోత్ర పవిత్ర దామరాజు సద్వంశ రంగమాంబా గోపాలకృష్ణ జ్యేష్ఠపుత్ర "సహజకవి" జాతీయకవి చక్రవర్తి" జాతీయ నాటక పితామహ ఇత్యాదిబిరుదాంకిత అఖండ గుంటూరు మండల వాస్తవ్య శ్రీపుండరీకాక్ష నామధేయ విరచిత స్వరాజ్య సోపానం గాంధివిజయ మనునాటక ప్రథమభాగము సర్వము సంపూర్ణము.

మ ం గ ళ ం మ హా త్

## అనుబంధము 1.

19వ పేజీ షౌకతాలీ "నేనే" పద్యమునకు బదులు.

"నేనే పౌరుషవంతుడనైతినేని, మా మహమ్మద్ ప్రవక్త సత్యవంతుడైనచో, మా మహమ్మదీయ జాతి రక్తనాళములలో క్షీరగ క్తము ప్రవహించుచున్నచో, మా జన్మభూమి ఈ ఆర్యావర్తమే యైనచో,- భూమ్యాకాశములు తలక్రిందులుగానీ, సముద్రము లింకనీ మరేమైనగానీ ఆపాశ్చాత్యాహంతక జాతి నిదే తుత్తునియలు గావించెదను గాక!"

## అనుబంధము 2.

40వ పేజీ.... "శరకు కత్తులబోలు-ధర్మమార్గాను-" పద్యములు షౌకతాలీకి బదులు మోతీలాల్ కాంగ్రెసు ఉపన్యాసాంతమున పాడవచ్చును.

## దయచేసి అచ్చుపొరబాట్లు దిద్దుకొనుడు

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | (శీర్షిక) 7 | సోనున్ | సోమున్ |
| 9 | 2 | మింకేమిటి | మికేటికి |
| 19 | (స్వ.సో.) 21 | దాని | రానీ |
| 22 | 10 | కొంచము | కొంచెము |
| 25 | 19 | ధరిత్రి | నీధరిత్రి |
| 30 | 11 | సమరురగు | సమర్థులగు |
| 31 | 14 | మయమగా | మయమా |
| 42 | 19 | సభాస్తార్య | సభాస్తార |
| 44 | 13 | ఏవడో | ఎవడో |
| 44 | 19 | 'నాతత్యవుసగ........పోవుచున్నాను'- | |
| | | | ఇవిబి శెంటు మాటలు |
| 49 | 9 | చి, బక్ | చి పనిక్. |
| 61 | 15 | చు డ్రి | చుండె |
| 61 | 18 | కర్తవ్యమో | కర్తవ్యము ? |
| 69 | 7 | రంగము | 5వ రంగము |



పీఠిక 13వ పేజీలో-మా నాట్యమండలిలో మొదటినుంచి హాస్య శేఖరుడు (శ్రీ) టి. పుల్లయ్య, (శ్రీ) మూల్పూరి కొండలరావు, గాన విశారద (శ్రీ) రాయసం వెంకటసుబ్బారావు, కీ॥ శే॥ అకలంకం, బొగ్గవరం మొదలగు వారు ప్రఖ్యాతనటకులు-వీరికినీ మా ధన్యవాదములు.

హిందీ ప్రెస్, గుంటూరు-2.

## SWARAJ SUPAN

# GANDHI VIJAYAM

[ A Thrilling Patriotic Drama of Freedom Fight ]

( *Banned by Br. Govt.* )



మహాత్మా మోహనదాస్ కరంచంద్ గాంధి